

# ఈ సంచికలో




23

15–9–49


# జనత



మార్క్సిస్టు సిద్ధాంత పక్షపత్రిక

| సంచిక 23 | 15—9—1949 | వెల : 8 అణాలు |
| --- | --- | --- |

## మార్క్సిస్టు విజ్ఞానం

# న్యాయమైన రోజుపనికి న్యాయమైన రోజుకూలి

ఫ్రెడెరిక్ ఎంగిల్స్

గత 50 సంవత్సరాలనుంచి ఇంగ్లీషుకార్మికోద్యమంయొక్క ఆశయం ఇదే. అపఖ్యాతికరములైన 'కాంబినేషన్ లాస్ (చట్టాలు)' 1824 లో ఉపసంహరింపబడిన తర్వాత ట్రేడ్‌యూనియన్లు అభివృద్ధి చెందే కాలంలో ఈ ఆశయం బాగానే పనిచేసింది. యూరోపియన్ కార్మికవర్గానికి ఇంగ్లీషు కార్మికులు అగ్రశ్రేణిలో ఉండి నడచినటువంటి మహత్తరమైన చార్టిస్టు ఉద్యమసమయంలో ఇది ఇంకా ఎక్కువ బాగా తోడ్పడింది. కాని కాలం మారిపోతూ ఉంది. 50 సంవత్సరాలకు—30 సంవత్సరాలకు పూర్వంకూడా—వాంఛనీయములుగా, ఆవశ్యకములుగా ఉన్నటువంటి అనేక మంచి విషయాలు నేడు నిరుపయోగకరములుగా, పూర్తిగా అప్రస్తుతములుగా తయారయ్యాయి. ఒకప్పుడు గౌరవనీయంగా ఉన్న ఈ వెనకటికాలపు ఆశయం (వాచ్‌వర్డ్) కూడా పై వాటిలోనే జమ అవుతుందా ?

న్యాయమైన రోజుపనికి న్యాయమైన రోజుకూలి? కాని అసలు న్యాయమైన రోజుకూలి అంటే ఏమిటి? న్యాయమైన రోజుపని అంటే ఏమిటి? ఆధునిక సమాజం ఏయే సూత్రాలపై ఆధారపడి ఉందో, ఏయే సూత్రాలపై అది అభివృద్ధిచెందుతూ ఉందో ఆ సూత్రాల ద్వారా వాటిని ఎలా నిర్ణయించడం? ఈ ప్రశ్నకు సమాధానం రాబట్ట డానికి నీతిశాస్త్రాన్నిగానీ, న్యాయశాస్త్రాన్ని (లా) గానీ, సమానతా (equity) శాస్త్రాన్నిగానీ లేక మానవజాతియొక్క మానసికభావాన్ని (సెంటిమెంటల్ ఫీలింగ్) గానీ, న్యాయాన్నిగానీ, ఉదారతనుగానీ వర్తింపజేయరాదు. నైతికంగా న్యాయమైనదీ, చట్టబద్ధంగా న్యాయ మైనదీ, సాంఘికంగా న్యాయం గాక పోవచ్చు. సాంఘికన్యాయమూ, అన్యాయమూ అనేది ఒకే ఒకశాస్త్రం (సైన్సు)ద్వారా నిర్ణయించబడు తుంది. ఉత్పత్తికీ మారకానికీ సంబంధించిన భౌతిక వాస్తవికవిషయా లను గురించి చర్చించే శాస్త్రమే, రాజకీయార్థిక శాస్త్రమే, ఆశాస్త్రం.

అయితే, రాజకీయార్థిక శాస్త్రం న్యాయమైన రోజు కూలి, న్యాయమైన రోజుపని అని దేనిని అంటుంది? కూలిరేటూ, రోజు పనియొక్క ఒత్తిడీ, (ఇంటెన్సిటీ) పనిచేసే కాలమూ (లెంగ్త్) యజ మానికీ, కార్మికునకూ మధ్య బహిరంగంగా మార్కెట్‌లో జరిగే పోటీద్వారా మాత్రమే నిర్ణయించ బడుతున్నాయి. న్యాయమైన రోజు కూలి, న్యాయమైన రోజుపని అంటే ఏమిటి? అవి ఎప్పుడు ఆ విధంగా నిర్ణయించబడుతున్నాయి?

కార్మికుని వసతియొక్క, దేశంయొక్క జీవిత ప్రమాణాన్నిబట్టి కార్మికుడు తనను (తన ఆరోగ్యాన్ని) పనిచేయగల స్థితిలో సరిగా ఉంచుకోడానికీ, తన భావాలను (రేస్) ప్రచారం చేసుకోడానికీ అవ సరమైన జీవన సాధనాలను సాధించుకునేందుకు తగిన మొత్తమే సాధారణ పరిస్థితుల్లో న్యాయమైన రోజుకూలి అనబడుతుంది. వ్యాపా రంలో ఉండే డోలాయమాన స్థితినిబట్టి నిజమైన కూలిరేటు ఒక్కొ క్కప్పుడు రేటుకు ఎక్కువగానూ మరొకప్పుడు తక్కువగానూ ఉంటుంది. కాని సక్రమ పరిస్థితుల్లోమాత్రం ఆరేటు క్రిందకీ పైకీ ఊగిసలాడే ఊగిసలాటలన్నిటికీ సగటున (యావరేజ్) సరిపోతుంది.

మరుసటిరోజున, ఇంకా ఆపైరోజుల్లో, మళ్ళీ అంతపని చేయడానికి కావలసిన శక్తిలోనుంచి కొంత శక్తిని కాజేయకుండా కార్మికునియొక్క ఒక రోజు పూర్తిగా పనిచేసే శక్తినిమాత్రమే వ్యయించేటటువంటి తీవ్రతా (ఇంటెన్సిటీ) పనిచేసే కాలమూ (లెంగ్త్ ఆఫ్ వర్కింగ్ డే) న్యాయమైన ఒకరోజు పని అవుతుంది.

ఈ మారకాన్ని (ట్రాన్సాక్షన్) ఈ క్రిందివిధంగా వివరించవచ్చు—కార్మికుడు పెట్టుబడిదారునకు తాను ఒక రోజు పూర్తిగా పనిజేసే శక్తిని ఇస్తున్నాడు. అంటే ముందుకూడా తాను అదేవిధంగా తన శక్తిని ఇవ్వడానికి (పనిచేయడానికి) తన కసాధ్యం గాకుండా ఉండే అంతవరకు కార్మికుడు పెట్టుబడిదారునకు తన శక్తి నిస్తున్నాడు. ఇందుకు బదులుగా కార్మికుడు పెట్టుబడిదారునుంచి ప్రతిరోజూ ఇలాంటి బేరాన్నే కుదిరించుకోడానికి అవసరమయ్యేటటువంటి జీవితావసరాలనుమాత్రమే పొందుతున్నాడు. కార్మికుడు తానుఇవ్వగలిగినంత ఎక్కువ ఇస్తున్నాడు. పెట్టుబడిదారు తాను ఇవ్వగలిగినంతతక్కువ ఇస్తున్నాడు. ఈబేరంయొక్కస్వభావమేఇది. ఇదిచాలావిచిత్రమైనన్యాయం.

ఈ విషయాన్ని ఇంకా కొంచెం లోతుకు దిగి పరిశీలించుదాం. రాజకీయార్థిక శాస్త్రరీత్యా కూలీ, పనిరోజులూ పోటీనిబట్టి నిర్ణయించబడతాయి. ఉభయులకు సమానమైన షరతులమీద ఉభయపక్షాలు న్యాయమైన స్థాయితో ప్రారంభిచడం (ఫెయిర్ స్టార్టు) న్యాయం అవుతుంది. కాని ఇప్పుడు అలా జరగడంలేదు. కార్మికునితో పెట్టుబడిదారు ఒడంబడికకు రాలేని పక్షంలో అతను ఎంతకాలమైనా ఆగగలడు. తన పెట్టుబడిపై ఆధారపడి జీవించగలడు. కాని కార్మికుని పరిస్థితి అలాంటిది కాదు. జీవించడానికి కూలిడబ్బులు మినహా కార్మికునకు మరెట్టి ఆధారమూ లేదు. కాబట్టి అతడు ఎప్పుడు ఎక్కడ ఏషరతులు సాధ్యమైతే ఆ షరతులపైనే పనిజేయడానికి ఒప్పుకొనితీరాలి. న్యాయమైన స్థాయితో బేరాన్నిప్రారంభించడానికి కార్మికునకు అవకాశం లేదు. ఆకలి అతన్ని దారుణంగా క్రుంగదీస్తూ ఉండడం అతనికి అదొక గుదిబండ (handicap) గా ఉంటుంది. అయినా పెట్టుబడిదారీ వర్గం యొక్క రాజకీయార్థిక శాస్త్రప్రకారం అదేన్యాయసూత్రం.

కాని ఇది ఒక స్వల్పవిషయం మాత్రమే. కొత్తవ్యాపారాలలో యాంత్రికశక్తినీ, యంత్రాలనూ ప్రవేశపెట్టడం వల్లా, వ్యాపారాల్లో యంత్రాలను విస్తృతంచేయడం, అభివృద్ధిచేయడంవల్లా, అనేక "చేతులను" (కార్మికులను) ఇదివరకే పనినుంచి విరివిగా తొలగించడం జరిగింది. దేశంలోని పరిశ్రమల్లో మళ్లీ ఈ తొలగించబడిన "చేతులను" తీసుకోడమూ, వాటికి పని చూపడం జరిగేదానికంటె ఆ "చేతులను" తొలగించడం చాలా ఎక్కువ వేగంగా సాగిపోతూ ఉంది. ఈవిధంగా తొలగించబడిన "చేతులు" పెట్టుబడి దారులకు ఉపయోగించే నిజమైన పారిశ్రామిక రిజర్వు సైన్యంగా ఏర్పడు తున్నాయి. వ్యాపారం మందంగా ఉంటే కార్మికులు పస్తులు పండు కోడం, ముష్టిఎత్తుకోడం, దొంగతనం చేయడం, వర్కుహౌస్‌కు వెళ్లడం జరుగుతుంది. ఇక వ్యాపారం సవ్యంగా ఉంటేనో, ఉత్పత్తిని విస్తృతం చేయడానికి పెట్టుబడిదారులకు కావలసినన్ని "చేతులు" సిద్ధంగా లభిస్తాయి. పై జెప్పిన రిజర్వు సైన్యంలోని స్త్రీలూ పిల్లలతో సహా కడపటిమనిషివరకూ పనిలో నియోగించబడేవరకు – అపరిమితంగా అధికోత్పత్తి జరిగే సమయాల్లో మాత్రమే ఇది జరుగుతుంది —అప్పటివరకు, వారిలో ఉండే పోటీయే కూలిని తగ్గిస్తుంది. ఈ రిజర్వు సైన్యం ఉండడంవల్లనే శ్రమతో పెట్టుబడి సాగించే పోరాటంలో పెట్టుబడి శక్తిబలపడుతుంది. పెట్టుబడితో జరిగే పోటీలో శ్రమ తన మెడకు తగిలించిన గుదిబండతో పోటీ చేయవలసి వస్తుంది. అయినప్పటికి పెట్టుబడిదారీ రాజకీయార్థిక శాస్త్రప్రకారం ఇది న్యాయమే.

సరే, ఈ న్యాయమైన కూలికి పెట్టుబడిదారులు ఏ నిధినుంచి డబ్బు చెల్లిస్తున్నారో పరిశోధించుదాం. పెట్టుబడి నుంచి చెల్లిస్తున్నారు. ఇది నిస్సందేహమే. కాని పెట్టుబడి అనేది విలువను ఉత్పత్తి చేయదు. భూమిని మినహాయించి సంపత్తిని ఉత్పత్తిచేసే శక్తి శ్రమ ఒక్కటిమాత్రమే పెట్టుబడి అనేది శ్రమ యొక్క కూడబెట్టిన ఉత్పత్తి తప్ప మరేమీగాదు. కాబట్టి శ్రమ యొక్క కూలిని శ్రమనుంచే చెల్లించడం జరుగుతూ ఉంది. కార్మికుడికు అతను స్వయంగా చేసిన ఉత్పత్తినుంచి యే కూలి ఇవ్వబడు

తుంది. సాధారణ న్యాయం అని మనం అనేటటువంటి న్యాయం ప్రకారం కార్మికుని కూలి అతనుచేసే శ్రమయొక్క ఉత్పత్తిలోనే ఇమిడి ఉండాలి కాని రాజకీయార్థిక శాస్త్రప్రకారం అది న్యాయంగా ఉండదు. పైగా, తద్ వ్యతిరేకంగా, కార్మికుని శ్రమయొక్క ఉత్పత్తి పెట్టుబడిదారునకు చెందుతుంది. కార్మికునకు అతని ఉత్పత్తినుంచి అతని కనీస జీవితావసరాలకు సరిపడేటంతమాత్రమే లభిస్తుంది. ఈవిధంగా కష్టపడి కార్మికులు చేసిన ఉత్పత్తి కష్టపడనివారి చేతుల్లోకి పోవడం, ఎవరైతే స్వయంగా ఉత్పత్తి చేశారో అట్టి కార్మికులనే బానిసలుగా చేయడానికి అదొక మహాశక్తిమంతమైన ఆయుధంగా పెట్టుబడిదారుల చేతుల్లో తయారుకావడం జరుగుతుంది. ఈ విధంగా ఈ అసాధారణమైన "న్యాయమైన" పోటీ సమాప్త మవుతుంది.

న్యాయమైన రోజుపనికి న్యాయమైన రోజుకూలి! న్యాయమైన రోజుపని అనే దానిని గురించి కూడా ఇంకా ఎంతో చెప్పవచ్చు. న్యాయమైన రోజుపని అనేదానిలోని న్యాయం కూలికి పూర్తిగా సరిసమానంగా ఉండాలి. దీనిని గురించి మరోసారి చర్చించుదాం. పాత కాలంనాటి నినాదంయొక్క ఆరోజులు గతించి పోయాయనీ, ప్రస్తుతం ఆ నినాదం చెల్లుబడికాదనీ పై జెప్పిన విషయాలను బట్టి స్పష్టమవుతోంది. సమాజంపై నేడు వాస్తవంగా అధికారం చలాయించే సూత్రాలను తయారుచేసే రాజకీయార్థిక శాస్త్రంయొక్క న్యాయం అంతా ఒక పక్షానికి - పెట్టుబడి పక్షానికి - మాత్రమే చెందినది. కాబట్టి ఆపాత ఆశయానికి శాశ్వతంగా సమాధిగట్టి ఆస్థానాన్ని మరో ఆశయంతో నింపవలసి ఉంటుంది:

**ముడిపదార్థాలు, ఫ్యాక్టరీలు, యంత్రాలు వగైరా పనికి ఉపయోగించే సాధనాలన్నీ కష్టజీవులైన ప్రజల చేతుల్లోనే ఉండాలి.**

(ది లేబర్ స్టాండర్డ్, లండన్ 7 మే 1881)

[పొలిటికల్ ఎఫైయిర్స్, ఏప్రిల్ సంచిక నుంచి]

# కమ్యూనిస్టులూ: ఆర్థిక సంక్షోభం

రజనీ పామీ దత్తు

[కమ్యూనిస్టులు ఆర్థిక సంక్షోభం రావాలనే కోరతారనీ, ఆర్థిక దుస్థితి విప్లవాలకు దోహదంచేస్తుందని వారు నమ్ముతారని బ్రిటిషు సామ్రాజ్యవాదులూ, వారితాబేదారులైన లేబరునాయకులు దుష్ప్రచారాన్ని కొనసాగించుతున్నారు. మనదేశంలో కూడా కాంగ్రెసు నాయకులూ, యితర ధనికవర్గాల ప్రతినిధులూ భారత కమ్యూనిస్టులపైన యిదేరకమైన నిందలను వేస్తున్నారు.

ఇది ఏవిధంగా తప్పుడు ప్రచారమో తెలియజేస్తూ ఆర్థిక సంక్షోభం యెడల కమ్యూనిస్టుల వైఖరిని కామ్రేడ్ రజనీ పామీదత్తు తన "లేబరుమంత్లీ" (జులై 1949)లో వ్రాసిన సంపాదక వ్యాఖ్యలలో స్పష్టంగా వివరించాడు. 'జనత' పాఠకుల కొరకు ఆ సమస్యకు సంబంధించిన భాగాన్నిమాత్రం యీ క్రిందనిస్తున్నాం. — సంపాదకవర్గం]

రానున్న ఆర్థికసంక్షోభాన్ని గురించీ, మార్షల్ "పునరుద్ధరణ" యొక్క బూటకత్వాన్ని గురించీ కమ్యూనిస్టులు ముందుగా చేసిన హెచ్చరికలూ, చెప్పిన భవిష్యద్వాణీ నిజమే అని రుజువైన సంగతిని అంగీకరించవలసి రావడంతో ప్రభుత్వనాయకులూ లేబరుపార్టీ రాజకీయనాయకులూ కమ్యూనిస్టులపై ఉక్రోషాన్ని వెళ్ళగక్కుతున్నారు. ఆర్థిక సంక్షోభం వస్తుందని కమ్యూనిస్టులు ముందుగానే హెచ్చరిక చేశారు. కాబట్టి కమ్యూనిస్టులు అసలు ఆర్థికసంక్షోభం రావాలనే కోరుతున్నారని కమ్యూ'స్టులపై నిందలు వేయసాగారు. చోరీ ఇన్స్యూరెన్సుపాలసీ (Burglary Insurance Policy) తీసుకొన్న వ్యక్తిపై అతను బుద్ధిపూర్వకంగా దొంగిలింపబడాలి అనే ఉద్దేశంతోనే ఆ విధంగా ఇన్స్యూర్ చేశాడని నిందలు వేయడంలో ఎంత అర్థం ఉందో ఈ నిందల్లోనూ అంతే. లేబర్పార్టీనాయకుల ఉన్మాదస్థితి మనలను నమ్మించ జూచినట్లుగా కమ్యూనిస్టులు తమ పాపభూయిష్ఠములైన

విప్లవప్రణాళికల నమలు జరపడానికి నిజంగా ఆర్థిక దుస్థితి ఏర్పడాలని కోరిఉన్నట్లయితే బెవిన్-క్రిప్స్ పాలసీలను వారు పూర్తిగా సంతోష పూర్వకంగా బలపరిచి ఉండేవాళ్లు. లేబర్ పార్టీ కాన్ఫరెన్సులో అధ్యక్షుడు ఇచ్చిన ప్రసంగంలో తమ విప్లవానికి దోహదంగా ఉండేందుకు "ఆర్థిక సంక్షోభాన్ని" కమ్యూనిస్టుపార్టీ వాంఛిస్తూ ఉంది అని మళ్లీ తన పాతగ్రామొఫోన్ ప్లేటునే పెట్టాడు కాని దుస్థితి (మిజరీ) విప్లవానికి దోహదం చేస్తుందని కమ్యూనిస్టుపార్టీ ఎన్నడూ బోధించలేదు. ఆ సిద్ధాంతం ట్రూమన్, మార్షల్, అట్లీలాంటి పడకకుర్చీ రాజకీయ వేత్తల బుర్రల్లో ఉండే భ్రమమాత్రమే. దుస్థితి ఎంతతీవ్రంగా ఉంటే విప్లవస్థాయికూడా అంత ఎక్కువగా ఉండేపక్షంలో మొత్తం ప్రపంచంలో టర్కీప్రజలు అందరికంటె ఎక్కువ విప్లవాత్మకంగా ఉండవలసింది. పాలకవర్గాన్ని కూలద్రోయడానికీ, తనవర్గంయొక్క అధికారాన్ని స్థాపించుకోడానికీ, నిలబెట్టుకోడానికీ నూతన సమాజాన్ని నిర్మించడానికీ సంఘటనలో, రాజకీయనాయకత్వంతో, పరిపక్వతతో, అనుభవంతో, అభివృద్ధిచెందుతూ ఉన్న (రైజింగ్) వర్గం అప్పటికే తగినంతబలపడి గట్టిపడి ఉన్నప్పుడు అలాంటివర్గం ద్వారా మాత్రమే, దివాళాతీసిన వర్గంయొక్క పరిపాలనలో దుర్భరమైన పరిస్థితులకు వ్యతిరేకంగా, విప్లవాలు కొనసాగించబడతాయి. ఒక్కదుస్థితి మాత్రమే, అయితే అది నిస్పృహకూ, జడత్వానికీ, అభివృద్ధి నిరోధకత్వానికీ, కూడా సమానంగానే దోహదం ఇస్తుంది.

## దుస్థితికి వ్యతిరేకంగా పోరాటం

ఆర్థికమాంద్యం ఫలితంగా అసంఖ్యాకులకు నిరుద్యోగం, పనికోసం ఒక కార్మికునితో మరొక కార్మికుడు పోటీపడడం, పనిలో ఉన్నవారు తమ ఉద్యోగం ఎక్కడ పోతుందో అనే భయంతో తమ పనులనే అంటిపెట్టుకొని ఉండడం, పనిలోనుంచి తొలగిస్తాం అని యజమానులు తమ పాత ఆయుధాలను - బెదిరింపులను - ఉపయోగిస్తూ ఉండడం—ఈ పద్ధతులు కార్మికవర్గ సంఘటనకు కమ్యూనిస్టులు ఆశించే, అభిలషించే, అనుకూల పరిస్థితులు కావు. కార్మికవర్గ

సంఘటనకూ, పోరాటానికీ ఇవి చాలా గడ్డు పరిస్థితులు ఈ పరిస్థితుల్లో కార్మికులు స్వయంగా గడించే అనుభవంద్వారా వారిలో ఉన్న కొన్ని సంస్కరణాత్మక భ్రమలు తొలగిపోయినా, ఈ పరిస్థితులే ప్రమాదకరమైన అభివృద్ధి నిరోధక వాచాలత్వంతో కూడిన ఫాసిస్టు ప్రచారానికి కూడా దారితీయవచ్చు. గట్టితనం (మిలిటెన్సీ) పైనా, సంఘటన బలంపైనా, వర్గచైతన్యంపైనా, ప్రతి విషయం ఆధారపడి ఉంటుంది. ముఖ్యంగా ఆర్థిక మాంద్యానికి పూర్వం అటో ఇటో తేల్చివేసే కాలంలో ఇది మరీ ప్రాధాన్యత వహిస్తుంది. కాబట్టి కమ్యూనిస్టులు పెట్టుబడిదారీ విధానంలో శాశ్వతంగా అందరికీ ఉద్యోగాలు లభిస్తాయి అనే భ్రమలకు వ్యతిరేకంగా హెచ్చరికలు చేస్తూనే ఆర్థిక సంక్షోభానికీ, అధ్వాన్న పరిస్థితులకు దారితీసే పాలసీలకు వ్యతిరేకంగా పోరాడుతారు. కార్మికవర్గం సంఘటననూ, కార్మికులపై సంక్షోభ భారాన్ని మోపడానికి చేసే ప్రయత్నాలకు వ్యతిరేకంగా సాగే ప్రతిఘటననూ సర్వవిధాలా బలపరుస్తారు. సంక్షోభానికి కార్మిక వర్గ పరిష్కారాన్ని చూపే ఆచరణీయ విధానాల (పాజిటివ్ పాలసీల) ద్వారా పోరాడతారు. ఆర్థిక సంక్షోభానికీ, దుస్థితికీ వ్యతిరేకంగా జరిగే పోరాటానికి కమ్యూనిస్టులే నాయకులు కాబట్టి ఉన్నత (జీవన) ప్రమాణం కోసం సాగే పోరాటానికికూడా కమ్యూనిస్టులే నాయకులు. సోషల్ డెమాక్రసీ పంథాకు ప్రత్యామ్నాయం (ఆల్టర్నేటివ్) రక్తపాతం యొక్క పంథాయే అని బ్లాక్ పూల్‌లో బెవిన్ ఉద్ఘాటించాడు. అలా ఉద్ఘాటించినప్పుడు తాను చెప్పిన పంథా సామ్రాజ్యవాదపంథా అనీ సామ్రాజ్యవాదంతో సమ్మేళన చెందిన సోషల్ డెమాక్రసీ యొక్క పంథా అనీ, మలయా, వియత్‌నాం దేశాల్లో వలసయుద్ధాలు సాగించే పంథా అనీ, ఫుల్టన్ పంథా అనీ, ఆటంబాంబు పంథా అనీ, మూడో ప్రపంచ యుద్ధానికి పంథా అనీ, రక్తసిక్తమైన పంథాఅనీ బెవిన్ మరచిపోయ్యాడు. లేక ఆయనకు మతిమరుపు వచ్చి ఉంటుంది. కమ్యూనిజం శాంతి కోసం సాగించే పోరాటానికి దారి తీస్తుంది.

౧

# విదేశాంగ మంత్రుల కౌన్సిల్ సమావేశం: దాని ఫలితాలు

ఏ. సొకోలోవ్

మేనెల 23వ తేదీనుంచి జూన్ 20వ తేదీవరకు ప్యారిస్‌లో జరిగిన విదేశాంగ మంత్రుల కౌన్సిల్ సమావేశం ప్రపంచ ప్రజలందరి దృష్టిని ఆకర్షించడానికి తగిన సహజ కారణాలున్నాయి. ఈ సమావేశంలో చర్చనీయాంశాలుగా ఉన్న జర్మన్ సమస్యయొక్క, ఆస్ట్రియన్ ఒడంబడికయొక్క ప్రాముఖ్యతనుగురించి విస్తరించి ఎక్కువగా చెప్పనవసరంలేదు. విదేశాంగ మంత్రుల కౌన్సిల్‌యొక్క కార్యకలాపాలలో ఒక సంవత్సర మున్నర కాలంపాటు విఘాతం ఏర్పడిన తర్వాత ఈ సమావేశం జరిగింది. పోట్స్‌డాం సమావేశంయొక్క చారిత్రక నిర్ణయాలు జర్మనీ, జపాన్ నాయకత్వాన నడచిన వెనకటి శత్రుదేశాలతో శాంతి ఒడంబడికల నిర్ణయించే బాధ్యతను ఈ విదేశాంగమంత్రుల కౌన్సిల్ పైనే ఉంచాయి. ఈ ఒకటిన్నర సంవత్సరంలో అమెరికా బ్రిటిష్ పరిపాలక వర్గాల్లో ఉన్న సామ్రాజ్యవాద ప్రణాళికల ప్రేరేపకులు యుద్ధోన్మాదాన్ని విపరీతంగా రెచ్చగొట్టారు. సోవియట్ యూనియన్‌తో ఒడంబడికకు రావడం అసంభవం అనే భావం కలిగేటట్లుగా సామ్రాజ్యవాదులు యుద్ధప్రచారంచేశారు.

ప్యారిస్ సమావేశానికి పూర్వమూ, ఆ సమావేశం జరుగుతూఉన్న సమయంలోనూ గుత్తపెట్టుబడిదారీ పత్రికలు అనుకూల వాతావరణాన్ని చెడగొట్టడానికి ఎడతెరిపిలేకుండా ప్రయత్నించారు. నిరాశాపూరితమైన వ్యాఖ్యానాలద్వారా సంప్రతింపులు తప్పకుండా భగ్నమవుతాయి అనే జోస్యాలద్వారా పిరికికండగలవాళ్ళను జడిపించడం భయపెట్టడం వగైరా తమకు స్వభావసిద్ధమైన పద్ధతులన్నిటినీ చేపట్టారు. సమావేశం విఫలమైతే సంతోషించాలని దురాక్రమణవాదులెంతో ఉబలాటపడ్డారు. ఈ సంప్రతింపులు భగ్నమైతే అంతర్జాతీయ వాతావరణం తమ కనుకూలంగా - యుద్ధోన్మాద పూరితంగా - మారుతుందని ఆశించారు. కాని పాపం వారిఆశలు నిరాశలై పోవడం ముఖ్యంగాగమనించదగినవిషయం. యుద్ధ ప్రేరేపకులు తమ శక్తుల నెక్కువగా అంచనా వేస్తున్నారనీ, శాంతికాముక శక్తుల బలాన్ని తక్కువ అంచనావేస్తున్నారనీ ఇందుమూలంగా మరోసారి నిరూపించబడింది.

ప్యారిస్ సమావేశఫలితాన్ని కొంత బాధా నివారణగా భావించి ప్రపంచం అంతా అభినందించింది. శాంతి కాముక జాతులు తీవ్రంగా అభిలషించే జర్మనీ

ఆర్థిక రాజకీయైక్యత యొక్క పునరుద్ధరణను గురించి ఒడంబడికకు రావడం అసాధ్యమని ఈ సమావేశంలో నిరూపించబడినా మొత్తంమీద ఈ దశలో కొంత పురోభివృద్ధికనిపించింది. ఈపురోభివృద్ధియే ముమ్ముందు అంతర్జాతీయ సహకారం ఇతోధికంగా ఏర్పడడానికి దారి తీస్తుంది. జర్మనీకి పూర్వం మిత్రదేశాలుగా ఉన్న వాటికి సంబంధించిన శాంతి ప్రణాళికల యొక్క. ముసాయిదాలను పరిశీలించిన న్యూయార్క్ సమావేశం (నవంబరు, డిసెంబరు 1946) తర్వాత, మొట్టమొదటి సారిగా అనేక సమస్యలపై విదేశాంగ మంత్రుల కౌన్సిల్ ఏకాభిప్రాయానికి రాగలిగింది అని అన్ని దేశాల పత్రికలూ దాని ప్రాముఖ్యతను నొక్కిచెప్పాయి. శాంతి ఒడంబడికకు సంబంధించిన మూల సమస్యలను పరిష్కరించడంలోనూ, అంతర్జాతీయ సహకారాన్ని పెంపొందించడంలోనూ, నిజమైన ప్రతిబంధకాలుగా ఉన్న విషయాలను గురించి ప్యారిస్ సమావేశంలో ఒక స్పష్టమైన దృక్పథం వెల్లడించ బడింది.

ప్యారిస్ సమావేశం చేసిన ప్రకటనలను బట్టి ఈ క్రింది నిర్ణయాలను ఏకగ్రీవంగా ఆమోదించడం జరిగింది.

మొదటిది: జర్మనీ ఆర్థిక రాజకీయైక్యతను సాధించడానికి నాలుగు రాజ్యాల విదేశాంగమంత్రులూ తమ ప్రయత్నాలను కొనసాగిస్తాం అని ప్రకటించారు. దీని కోసం మిత్రరాజ్యసమితి సర్వసభ్య సమావేశం (జనరల్ అసెంబ్లీ)యొక్క నాలుగో సమావేశంలో సెప్టెంబరు నెలలో సమావేశమైనప్పుడు జర్మనీ సమస్యపై చర్చించడానికి మళ్ళీ విదేశాంగమంత్రుల కౌన్సిల్ సమావేశంయొక్క తేదీ వగైరా తదితర ఏర్పాట్ల విషయంలో ఒక ఒడంబడికకు రావడానికి నాలుగు రాజ్యాల ప్రతినిధులూ ఒక అంగీకారానికి రావడం జరుగుతుంది. గత ఒకటిన్నర సంవత్సర కాలంనుంచి మూడు పశ్చిమరాజ్యాలు విదేశాంగ మంత్రుల కౌన్సిల్ సమావేశం జరగకుండా ఉండేందుకు తీవ్రంగా ప్రయత్నించాయి. యుద్ధానంతర ఒడంబడికలను సాధించడంలోనూ, ముఖ్యంగా జర్మనీ సమస్యను పరిష్కరించడంలోనూ, విదేశాంగమంత్రుల కౌన్సిల్ యొక్క యోగ్యతను గురించి పశ్చిమ రాజ్యాల ప్రతినిధులు పదేపదే సంశయాలను వెలిబుచ్చారు. కౌన్సిల్ పట్ల నిరుపయోగం అనేభావం కలిగేటట్లుగా బుద్ధిపూర్వకంగా వాళ్ళు అనేక అనుమానాలు కలిగించారు. విదేశాంగమంత్రుల కౌన్సిలూ, పోట్స్‌డం నిర్ణయాలూ, ఎప్పుడో నిర్జీవమైపోయాయిఅనీ వాటిని పాతివెయ్యడం కూడా జరిగింది అనీ బూర్జువావర్గ పత్రికలు పదేపదే ప్రకటించాయి.

ఇక రెండోవిషయం. జర్మనీయొక్క ఆర్థిక, రాజకీయ సమైక్యతా కృషిని విదేశాంగ మంత్రుల ఉద్దేశాల ననుసరించి కొనసాగించటంకోసం బెర్లిన్‌లో వున్న నాలుగు రాజ్యాల ఆక్రమణాధికారులు సమాలోచనలు కొనసాగిస్తారు. ఇతర లక్ష్యాలతోపాటు, ప్రస్తుతం విభాగిత జర్మనీ, విభాగిత బెర్లిన్ పరిపాలనలవల్ల కల్గిన చిక్కులను తొలగించటం, వివిధ భాగాలమధ్య వాణిజ్యాన్ని విస్తరింపచేయటం, ఆర్థిక సంబంధాలను అభివృద్ధిపర్చటం, బెర్లిన్ జీవితాన్ని మామూలు పరిస్థితికి తేవటం మొదలైన ఉద్దేశాలతో యీ సమాలోచనలు కొనసాగించబడుతాయి. ఈ కృషిలో సహకరించేందుకు

జర్మన్ ప్రవీణులను, సముచితమైన జర్మన్ సంస్థలను ఆయా ప్రాంతాల విషయం వచ్చినప్పుడు నాలుగుదేశాల ఆక్రమణాధి కారుల్లో ఏ ఒక్కరైనా ఆహ్వానించ వచ్చు. అలా ఆహ్వానించబడ్డ జర్మన్‌లు వివిధ భాగాలమధ్య ఆర్థిక సంబంధాలను అభివృద్ధి పర్చటంలో సాయపడే రీతిగా సరియైన లెక్కలను తయారుచేసి, రిపోర్టు లను సిద్ధపర్చి, ప్రతిపాదనలను తయారు చేసి - వీటన్నిటిని ఆక్రమణాధికారులకు అందచేయాలి.

ఇక మూడో విషయం. రెండు సంవత్స రాలకుపైగా పరిష్కారం కానటువంటి ఆస్ట్రియన్ సంధి సమస్యకు చెందిన ప్రధానమైన విషయాలలో పారిస్‌లో అంగీకారం కుదిరినట్లు యీ ప్రకటనలవల్ల స్పష్టమవుతోంది. ముసాయిదా సంధి షరతులను 1949 సెప్టెంబరు 1వ తేదీ నాటికి డిప్యూటీ మంత్రులు సిద్ధంచేయా లని నిర్ణయించటంవల్ల యీ ఒడంబడిక చక్కటి పునాదిని వేసిందనవచ్చు. దీనిని బట్టి ఆస్ట్రియన్ సంధిపత్రంపై యీ సం వత్సరాంతంలోనే సంతకాలు జరగవచ్చు.

# II

విదేశాంగమంత్రుల కౌన్సిల్‌యొక్క ప్యారిస్ సమావేశంలో జరిగిన యీ నిర్మా ణాత్మకమైన నిర్ణయాలు సోవియట్ యూనియన్‌యొక్క నిశ్చలమైన శాంతి పంథాకు ఒకపెద్ద విజయాన్ని సూచిస్తు న్నాయి. చిత్తశుద్ధితోకూడిన అంతర్జా తీయ సహకారానికై సోవియట్ నాయ కత్వాన ప్రజాతంత్ర కూటమి నెరపిన పోరాటం ఫలితంగా యీ నిర్ణయాలు సాధ్యపడ్డాయి. ఈ ప్రజాతంత్ర కూటమి పైననే ప్రపంచశాంతి, జాతుల భద్రత ప్రధానంగా ఆధారపడివుంది.

ఈ పారిస్‌సమావేశం పశ్చిమరాజ్యాలు అనుసరిస్తున్న దురాక్రమణ పంథాను వమ్ముచేసింది. నిష్ఫలమొనర్చింది. జె. వి. స్టాలిన్ వివరించినట్లు దురాక్రమణను రెచ్చగొట్టుతున్న వీరికి సోవియట్ రష్యాతో ఒడంబడిక కుదుర్చుకోవలసిన అవసరం కాని, సహకారం నెరపవలసిన ఆవశ్యకతగాని కనపడటంలేదు. మాటల్లో మాత్రం ఒడంబడిక చేసుకోవాలని సహకారం కావాలనీ అంటారు. ఒడంబడిక అంటే విసుగు పుట్టించి, తర్వాత అభారాన్నంతా సోవి యట్ నెత్తిన రుద్ది, తద్వారా ఒడం బడిక అసంభవమని 'రుజువు' చేయాలని తాపత్రయ పడుతున్నారు. ఈ రోజుల్లో అంతర్జాతీయంగా సోవియట్ రష్యాను వేరుపర్చాలన్న దివాళాకోరు పాలసీ తిరిగి పునరుద్ధించటానికిచేసేప్రతిప్రయత్నం మహత్తర సోవియట్ రాజ్యాన్ని పాల్గొననీయకుండా జర్మనీ సమస్యతో సహా సకల అంతర్జాతీయసమస్యలను పరిష్క రించటానికిచేసేప్రతిప్రయత్నం పూర్తిగా నిష్ఫలంకావటం తథ్యం. ఇదే సత్యాన్ని ప్యారిస్ సమావేశం రెండువిధాల రుజువు పర్చింది. ఈ సమావేశంలో కుదిరిన పాక్షిక ఒడంబడికల ద్వారాను, యూరప్ ఖండంలోను, ప్రపంచంలోను శాంతిని సుస్థిరం చేయటానికి ప్రధాన ప్రతిబంధకంగా వున్న జర్మనీ సమస్య పరిష్కారం కాకుండా నిలచి

పోవటానికిగల కారణాలను బట్టబయలు పెట్టటంద్వారాను యీ సత్యం రుజువైంది.

సోవియట్ ప్రభుత్వం ప్యారిస్ సమావేశంలో చారిత్రాత్మక పోట్సుడం నిర్ణయాలకు పూర్తిగా కట్టుబడుతూ పశ్చిమ రాజ్యాల విచ్ఛిన్నకర చర్యలవల్ల ఛిన్నాభిన్నమైన జర్మనీ ఐక్యతను పునఃస్థాపించటానికి స్పష్టమైన నిర్మాణాత్మక ప్రతిపాదనలను ప్రతిపాదించింది. అంతర్జాతీయ భద్రతకు హానికరమైనటువంటి జర్మన్ ప్రజానీకానికిఅధిక బాధలను కల్గించేటటువంటివిధానానికిస్వస్తిచెప్పి సాధ్యమైనంత త్వరలో జర్మనీని ఐక్యపర్చాలని పశ్చిమ రాజ్యాలు నిజంగా తహతహలాడుతున్న పక్షంలో యీ ప్రతిపాదనలు వారికి నిరాఘాటంగా అంగీకారమైనట్టివే. సోవియట్ ప్రభుత్వం తరఫున వీటిని ప్రతిపాదిస్తూ విదేశాంగమంత్రి ఎ. వై. విషిన్‌స్కీ ఆ సమావేశంలో ఎంతో ఓర్పుతో ఇలా వివరించటం అందరూ ఎరిగినవిషయమే.

(i) గతంలో పోట్స్‌డం నిర్ణయాల ద్వారా వేయబడిన పునాదిపై, జర్మనీ అంతటికీ ఉన్నతాధికార సంస్థగా కంట్రోల్ కౌన్సిల్ కార్యకలపాలను తిరిగి ప్రారంభించటం.

(ii) పశ్చిమ, తూర్పు భాగాలలో ప్రస్తుతం పనిచేస్తున్న జర్మన్ ఆర్థిక సంస్థల ఆధారంతో అఖిల జర్మన్ స్టేట్ కౌన్సిలు నొకదానిని ఏర్పరచటం, ఆర్థిక, రాజకీయ రంగాలలో విస్తృతమైన ప్రభుత్వాధికారాలన్నింటినీ దానికి అప్పగించటం.

(iii) జర్మన్ ముఖ్య పట్టణంలో మామూలు జీవిత పరిస్థితులను స్థాపించటం కోసం బెర్లిన్‌లో మిత్రరాజ్య అధికార సంస్థను.(బెర్లిన్ ఎల్లైడ్ కొమన్‌డంటూర్ పునఃస్థాపించటం, బెర్లిన్ అంతటికీ ఒకే మేజస్ట్రేట్‌ను తిరిగి నియమించటం.

గత రెండుసంవత్సరాలుగా విషమించుతూ వచ్చిన ప్రస్తుత పరిస్థితుల్లో సైతం యీ ప్రతిపాదనలు అంగీకారయోగ్యమైనట్టివే. ఇటువంటి ప్రతిపాదనలు చేస్తూనే అఖిల జర్మన్ ప్రజాస్వామిక ప్రభుత్వాన్ని స్థాపించటంకోసం చర్చలు జరపటానికి సోవియట్ ప్రతినిధివర్గం తన అంగీకారాన్ని తెలియచేసింది. ప్రజాస్వామిక సార్వజనిక ఎన్నికల ద్వారా యీ ప్రభుత్వస్థాపన జరగాలని తెలియపర్చింది. విదేశాంగమంత్రుల యొక్క మాస్కో, లండన్ సమావేశాల్లో యీ సమస్యపైన సోవియట్ ప్రభుత్వం చేసిన ప్రతిపాదనలను గుర్తుచేస్తూ ఎ. వై. విషిన్‌స్కీ యిలా అన్నాడు :

"...అఖిలజర్మన్ ప్రజాస్వామిక ప్రభుత్వాన్ని స్థాపించాలన్న విషయంలో సోవియట్ ప్రభుత్వం యొక్క వైఖరి ఏ విధంగానూ మారలేదు".

పశ్చిమ రాజ్యాలవైఖరి కారణంగా శాంతి సంధివిషయంలో వచ్చిన ప్రతిష్టంభనను తొలగించి, శాంతిసంధి షరతులను తయారుచేయవలసిన అవసరాన్నిగూర్చి ప్యారిస్ సమావేశంలో సోవియట్ ప్రభుత్వం వక్కాణించింది. సోవియట్ ప్రతినిధులు దీనిప్రాముఖ్యతను గూర్చి ఆవశ్యకతనుగూర్చి పదేపదే వక్కాణిస్తూ వచ్చారు.

మహత్తర అక్టోబరు సోషలిస్టు విప్లవంయొక్క 31వ వార్షికోత్సవ సందర్భంలో వి. యం. మోలటోవ్ ఇలా హెచ్చరించాడు. "మిత్రరాజ్యాల మధ్యకుదిరిన ఒడంబడికల

ననుసరించి జర్మనీ, జపాన్‌ల విషయంలో శాంతిసంధి షరతులు నిర్ణయించబడాలని సహజంగా సోవియట్ యూనియన్ పట్టుబడుతోంది".

జర్మనీతో చేసుకోవాల్సిన శాంతి సంధినిగూర్చిన ముసాయిదాలను నాలుగు రాజ్యాల ప్రభుత్వాలు మూడు నెలల లోపల విదేశాంగమంత్రుల కౌన్సిల్‌కు అందచేయాలని సోవియట్ ప్రతినిధివర్గం ప్యారిస్ సమావేశంలో ప్రతిపాదించింది. ఈ శాంతిసంధిపై సంతకాలు జరిగిన ఒక సంవత్సరంలోపున ఆక్రమణ సైన్యాలు జర్మనీనుంచి ఉపసంహరించబడేటట్లు ఆ షరతులు వుండాలనికూడ సూచించింది. విదేశాంగ మంత్రుల కౌన్సిల్ యొక్క సమావేశాల్లో శాంతిసంధిని తయారుచేయటంలో అవలంబించాల్సిన విధానాన్ని గూర్చి లోగడ చర్చించారు. కొంత మేరకు పురోగమనంకూడ సాగింది. విధానం ఏ విధంగా వుండాలో యీ సమావేశంలో చర్చించి, నిర్ణయించాల్సిందిగా సోవియట్ ప్రతిపాదించింది.

ఎ. వై. విషిన్‌స్కీ ప్యారిస్ సమావేశంలో యిలా ప్రకటించాడు: "యుద్ధంవల్ల ఒక్క జర్మనీకేగాక, సకల యూరపియన్ శాంతికాముక జాతులకుకూడ సంఘటిల్లిన దుష్ఫలితాలను నివారించటానికి జర్మనీతో శాంతిసంధి ఒక్కటే సక్రమమైన మార్గం. జర్మనీయొక్క ఆర్థిక, రాజకీయ పునరావాసంకోసం, ఐక్య, శాంతికాముక, ప్రజాస్వామిక రాజ్యముగా అభివృద్ధిచెందటానికి ఈమార్గం దారితీస్తుంది. అందువల్ల యీ శాంతి సంధిని త్వరితగతిని పూర్తిచేయటంవల్ల ఒక్క జర్మన్ ప్రజలకేగాక, 1945 సంవత్సరంలో యాల్టా, పోట్సుడాంలలో నాటబడిన ప్రజాస్వామిక సూత్రాలననుసరించి శాంతిని సుస్థిరం చేయవలసిందిగా తహతహలాడుతున్న ప్రపంచ ప్రజల కోర్కెను మన్నించినట్లవుతుంది. అమెరికన్, గ్రేట్ బ్రిటన్, సోవియట్ యూనియన్ ప్రభుత్వనాయకులు కలసి సంయుక్తముగా 1945 ఫిబ్రవరిలో చేసిన ఆ ప్రకటనలో యీ సూత్రాలు మూర్తీభవించాయి. ఇతర శాంతికాముకజాతుల సరసను, శాంతికి, భద్రతకు, స్వేచ్ఛకు, మానవజాతియొక్క సర్వవ్యాపిత శ్రేయస్సుకు దోహదం యిచ్చే, న్యాయంపైన ఆధారపడిన అంతర్జాతీయ వ్యవస్థకు కృషిచేస్తామని అందులో తెల్పబడింది"



సంభాషణలలో పాల్గొనే అన్నిపార్టీలను అంగీకారయోగ్యమైనవిగా వుండాలన్న అభిలాషతోనే సోవియట్ పైప్రతిపాదనలను ప్యారిస్ సమావేశంలో చేసిందన్న విషయాన్ని కాదనటం అసంభవం. పశ్చిమ రాజ్యాల ప్రతినిధులు యీ ప్రతిపాదనలను గూర్చి ఎటువంటి అభిప్రాయాలను వెలిబుచ్చారు?

వారు సమావేశాలలో అనేకసార్లు సోవియట్ ప్రతిపాదనలు అంగీకారయోగ్యమైనవి కావని మాత్రమే వక్కాణించారు. వీటికి ప్రత్యామ్నాయంగా

నిర్మాణాత్మకమైన ప్రతిపాదనలను వేటిని చేయలేదు. ప్రపంచ ప్రజలముందు యీ ఎత్తుగడల బండారం బయట పడినతర్వాత జర్మనీ ఐక్యతను నగ్నంగా ఎదిరించేవారు గానూ, అంతర్జాతీయ సహకారాన్ని విచ్ఛిన్నపర్చేవారు గానూ ఆభాసుపాలయిన తర్వాత ఆసాంతంలో పశ్చిమ రాజ్యాల ప్రతినిధులు ప్రత్యామ్నాయ ప్రణాళిక నొకదానిని ప్రవేశపెట్టారు. జర్మనీ సమస్యా పరిష్కారానికి వీరు గుడ్డిగా మార్గాన్ని చూపుతున్నారు. ఆంగ్లో - అమెరికన్ ఆక్రమణాధికార్ల తాఖీదుతో కొద్దిమంది దుర్నీతిపరులైన జర్మన్ రాజకీయ వేత్తలు ప్రజాస్వామిక వ్యతిరేకమైన బోన్ - రాజ్యాంగాన్ని తయారుచేశారు. అట్టి రాజ్యాంగంలోకి సోవియట్ భాగాన్ని చేర్చమంటున్నాయి యీ ప్రత్యామ్నాయ ప్రతిపాదలు. జర్మనీ ఆక్రమణను అక్రమంగా పొడిగించటం కోసం, జర్మనీలో వలస ప్రభుత్వాన్ని స్థాపించటం కోసం, ఉద్దేశింపబడిన యీ దుష్టరాజ్యాంగాన్ని యావత్తు జర్మనీ పైన యద్దాలంటున్నాయి యీ ప్రతిపాదనలు. ఈ సమస్యను పరిష్కరించటానికి నిర్మాణాత్మకమైన సూచనలను యీ ప్రతిపాదనలు చేయటంలేదు. పశ్చిమ రాజ్యాల తాఖీదును అంగీకరించి గతంలో డాలర్ రాజకీయకుతంత్రంయొక్క తాఖీదుపై వేరువేరుగా వారు చేసిన నిర్ణయాలను బద్ధులు కమ్మని సోవియట్‌ను కోరుతున్నాయి. ఇటువంటి ప్రతిపాదనలు సహజంగానే తిరస్కరించబడుతాయి.

అసలు గమనించాల్సిన విషయ మేమిటంటే యీ ప్రతిపాదన కర్తలే వీటిని అంగీకార యోగ్యమైనవిగా భావించటం లేదు. వారినిజోద్దేశం వేరుగా వుంది. సోవియట్ యూనియన్‌తో సహకారం ఒడంబడిక అసంభవమని "ఋజువు" చేయటానికే వారి తాపత్రయ మంతాను.

కాని ఎంతచక్కగాను, వాదపటిమతోను కూడుకొని వున్న సోవియట్ ప్రతిపాదనలు పశ్చిమ రాజ్యాలను యిరకాటంలో పెట్టాయి. సోవియట్ ప్రతిపాదనలకు వ్యతిరేకంగా వారు చూపిన సాకులు నిజంగా హేయమైనవి. వాదన చేయటానికి బదులు పశ్చిమ రాజ్యాల రాజనీతిపరులు బుకాయించటం ప్రారంభించారు. సోవియట్ ప్రతిపాదనలు 'వెనక్కు లాక్కుపోతున్నాయి'-పశ్చిమ రాజ్యాల అధీనంలో వున్న జర్మనీ భాగాలు కలిసిన "ముందంజ"తో పోల్చిచూస్తే యీ ప్రతిపాదనలు యింకా "వెనక్కు లాక్కుపోతున్నాయి"-అనే ధోరణిలో బుకాయించటం ప్రారంభించారు. ప్యారిస్ సమావేశానంతరం ప్రెసిడెంట్ ట్రూమన్ "1945 సంవత్సరం నుంచి పశ్చిమ జర్మనీలో ప్రధానమైన అభివృద్ధి జరిగింది" అంటూ బుకాయించాడు.

అయితే యీ "అభివృద్ధి" ఎటువంటిది? జర్మనీ పశ్చిమభాగాలలో వున్న దారుణపరిస్థితిని ఆంగ్లో-అమెరికన్ ఆక్రమణాధికారుల అధికార ప్రకటనలు సైతం కప్పిపుచ్చలేకపోతున్నాయి. జర్మనీని ప్రజాస్వామికమొనర్చాలనీ, జర్మనీ సైనికశక్తిని నిస్సత్తువుగా మార్చాలనీ ఉద్దేశించిన పోట్స్డం కార్యక్రమంనుంచి దూరమవటం కారణంగా, పశ్చిమ రాజ్యాలు వేరుపంధానుఅనుసరించటంవల్ల యీదారుణపరిస్థితి సంభవించింది. నిన్నటిదాకా హిట్లర్ ప్రభుత్వానికి ప్రబలమైన అండగావున్నటువంటివన్నీ, ఇప్పుడు అమెరికన్ గుత్తవ్యాపారసంస్థలకు తొత్తులుగా

పనిచేస్తున్నటువంటిస్నీ జర్మన్ గుత్తదార్ల, జంకర్ల చేతుల్లో సర్వాధికారం వుంచటాన్ని "అభివృద్ధి" అని పిలవటం సరియైనదేనా? లేక నాజీశక్తుల విచ్ఛిన్నపర్చే కార్యక్రమాన్ని కుంటుపర్చటం, జర్మన్ ప్రజాస్వామికశక్తులను క్రమబద్ధముగా వేటాడడం "అభివృద్ధి" అనిపించుకుంటుందా? జర్మన్ ప్రజానీకానికి సహాయపడే శాంతికాలపు పరిశ్రమలను నిర్మూలనచేస్తూ, యుద్ధపరిశ్రమలను తిరిగి పెద్ద ఎత్తున పునస్థాపన చేయటం 'అభివృద్ధి' అనిపించుకుంటుందా? నిరుద్యోగసమస్య తీవ్రరూపం చెందటం, ప్రజలు నిత్యదరిద్రులు కావటం, 'అభివృద్ధి' అనిపించుకుంటుందా? వలస ఆక్రమణచట్టంవంటి బోన్ రాజ్యాంగానీ దానికి వ్యతిరేకంగా దేశవ్యాపితంగా చెలరేగుతున్న కోపోద్రేకంగానీ, 'అభివృద్ధికి'కి చిహ్నమా?

ఆంగ్లో - అమెరికన్ రాజ్యాలయొక్క జర్మనీ విభజన కార్యక్రమం అంతర్జాతీయంగావున్న సంబంధాలన్నింటిపైన ఎటువంటి దుష్ఫలితాలకు దారితీస్తుందో వేరే చెప్పనవసరంలేదు. అంతర్జాతీయంగా ఉద్రిక్త పరిస్థితిని సృష్టించటం, బెర్లిన్ వంటి కృతక సమస్యలను కల్పనచేయటం, ఆవిధంగా కల్పనచేసిన పిదప దానిని ఆధారం చేసుకొని రెచ్చగొట్టే ఉద్యమాన్ని నెలలతరబడి సిగ్గువిడిచి సాగించటం - 'అభివృద్ధి' అంటే యిదేనా?

జర్మనీ విషయంలో పశ్చిమ రాజ్యాలయొక్క ప్రత్యేకపంథావల్ల సాధించబడిన "విజయాలు" యివి అయినప్పుడు, ఇట్టి విభిన్న పంథాను ఖచ్చితంగా విడనాడి, పోట్స్‌డాం నిర్ణయాలు ఏర్పరచిన సక్రమ మార్గాన్ని చేపట్టటం వెనుకంజవేయటమవుతుందా? వెనుకంజ కాకపోగా ముందంజ అని సువిదిత మవుటలేదా?

జర్మన్ సమస్యనుగూర్చిన సోవియట్ ప్రతిపాదనలకు వ్యతిరేకంగా పశ్చిమ రాజ్యాలు తమ వాదనలో ఏకగ్రీవసూత్రం ప్రసక్తి తెచ్చాయి. ఏకగ్రీవ సూత్రంపైననే కంట్రోల్ కమిషన్, బెర్లిన్ ఎల్లైడ్ కొమన్‌డంటూర్ పనిచేయాలన్న పక్షంలో వాటి కార్యకలాపాలను తిరిగి ప్రారంభించటం నిష్ప్రయోజన మవుతాయని వారు వాదించారు. ఈ సూత్రాన్ని దుయ్యబట్టాలన్న దురుద్దేశంతో యీ సమావేశంలోను, పత్రికల్లోను దీనిపై దాడి సాగించారు. ఈ సూత్రమే అన్ని వైఫల్యాలకు మూలకారణమన్న భావాన్ని కల్గించటంకోసం చేయవలసినదంతా చేసారు. అగ్రరాజ్యాల ప్రతినిధులమధ్య ఏకగ్రీవాభిప్రాయం కావాలన్న యీ సూత్రానికి వారు మరొకసూత్రం సూచించారు. మెజారిటీ ఓటుప్రకారం నిర్ణయానికి రావటమే ఆ సూత్రం. అంటే దీని అర్థం కొన్ని రాజ్యాల నిర్ణయాలను యితర రాజ్యాలపైన రుద్దటం.

ఏమైనప్పటికీ ప్యారిస్ సమావేశం ఒక విషయాన్ని మరొకసారి స్పష్టపర్చింది. అంతర్జాతీయ వ్యవహారాల్లో తాఖీదులను రుద్దేప్రయత్నాలకు స్వస్తిచెప్పి, అందరికీ అంగీకారయోగ్యమైన నిర్ణయాలను చేయటంకోసం మార్గం వెతకాలన్న ఒకేఒక సక్రమపంథాను చేపట్టాలని యీ సమావేశం ఫలితాలు మరొకసారి తెలియచేసాయి. ఏకగ్రీవ సూత్రం అనే బూచిని చూపెట్టి అసలు సమస్యలను కలగాపులగం చేయటం వట్టివ్యర్థప్రయత్నమని రుజువైంది.

# IV

ఎంతో ప్రాముఖ్యమైనటువంటి నిర్మాణాత్మకమైనటువంటి సోవియట్ ప్రతిపాదనలను వ్యతిరేకిస్తూ పశ్చిమ రాజ్యాల ప్రతినిధులు ఏవిధమైన విలువ గల్గినట్టిగాని నిర్మాణాత్మకమైనట్టి గాని, లేక వాదపటిమ పూరితమైన విమర్శను గాని చేయలేకపోయారు. పశ్చిమరాజనీతిజ్ఞులయొక్క వాదనలోని బలహీనత రాజకీయాలోచనలోని గొడ్డాలుతనాన్ని చూసి ఆశ్చర్యపడాల్సిన అవసరంలేదు. అయినప్పటికీ పశ్చిమ రాజ్యాల ప్రతినిధులు సోవియట్ యూనియన్‌తో పాక్షిక ఒడంబడికను చేసుకోవలసి రావటం ఎలా సంభవించింది? ఇదివరకు విదేశాంగమంత్రుల కౌన్సిల్ సమావేశంలో వారు అనేక పర్యాయాలు చేసినట్టు యీ దఫా సంభాషణలను విచ్ఛిన్నం చేయటానికి ఎందుకు సాహసించలేక పోయారు?

ఈ ప్రశ్నలకు సమాధానం ప్రస్తుత అంతర్జాతీయ పరిస్థితిలో యిమిడివుంది. 1947 సంవత్సరాంతంలోగాని 1948 మొదటిభాగంలోగాని వున్న పరిస్థితికి 1949 సంవత్సర మధ్యభాగంలోని పరిస్థితికి మధ్య ఎంతో భేదంవుంది.

యుద్ధోన్మాదులకు వ్యతిరేకంగా, శాంతిని సుస్థిరంచేయటంకోసం ప్రజాస్వామిక కూటమిలోని శక్తులు క్రమేణా పుంజుకొంటున్నాయి. అంతర్జాతీయంగా సోవియట్ యూనియన్‌యొక్క గౌరవంలో ప్రజానురంజకంలో ఎంతో అభివృద్ధి కాన్పించటం, స్టాలిన్ శాంతి విధానంపైన ఆదరాభిమానాలు పెరగటం, మహత్తర రాజ్యమైన సోవియట్ సోషలిస్టు రాజ్యంసాధించిన మెచ్చుకోదగ్గ ఆర్థికాభివృద్ధి, సోషలిజం వైపుకు పురోగమించే నూతన ప్రజాస్వామిక దేశాలు ఆర్థిక రంగంలో త్వరితగతిని సాధిస్తున్న అభివృద్ధి, సామ్రాజ్యవాద తొత్తులను నిర్మూలిస్తూ చైనాప్రజలు సాధిస్తున్న చారిత్రాత్మక విజయాలు, శాంతిరక్షణకోసం, అమానుషమైన బాధ్యతారహితమైన నూతనయుద్ధ ప్రణాళికలకు వ్యతిరేకంగా ప్రపంచవ్యాపితంగా లక్షలాది కార్మికులను విస్తృతమైన ఉద్యమంలో సంఘటితం చేయటం ఇవన్నీ పై దానిని రుజువుపర్చుతోంది.

రెండోప్రక్క ప్రపంచాధిపత్యంకోసం ఉవ్విళ్ళూరుతున్న సామ్రాజ్యవాద కూటమిలో కలతలు, కష్టాలు, ఆ కూటమిని వూబిలోకి యీడ్చుతున్నాయనటం కూడ నిర్వివాదాంశం. ఆంగ్లో - అమెరికన్ పాలకముఠాలు కొత్త యుద్ధానికై బాధ్యతారహితంగా అనుసరిస్తున్న విధానానికి వ్యతిరేకంగా పెరుగుతున్న ప్రజావ్యతిరేకత, ప్రత్యేకంగా జర్మనీని విభజించటం, యూరప్‌ను ఛిన్నాభిన్నం చేయటంలో ప్రదర్శితమైన ఆంగ్లో-అమెరికన్ విధానంయొక్క దివాళాకోరుతనం, పెట్టుబడిదారీ ప్రపంచంలో పెచ్చుపెరుగుతున్న ఆర్థిక సంక్షోభం, దీనికి తోడుగా మార్కెట్లకోసం నానాటికి తీవ్రతరమౌతున్న కలహాలు, ఆంగ్లో - అమెరికన్ ముఠాలయొక్క ప్రయోజనాలకోసం చెలరేగుతున్న కలహాలు - ఇవన్నీ పై విషయాన్ని రుజువుచేస్తున్నాయి.

జర్మనీని విభాగించు విధానం పట్టి నిష్ప్రయోజనమన్న దానిని కప్పిపుచ్చ

టానికి ఎన్ని వేషాలు వేసినప్పటికి లాభం లేదు. ఈ విధానం యెడల అసంతృప్తి, దానికి వ్యతిరేకంగా ఆందోళన పెరిగి పోతోంది. పశ్చిమ రాజ్యాలయొక్క పాలకవర్గాల పలుకుబడిలోవున్న పత్రికలుసైతం జర్మనీ విషయంలో స్టేట్ డిపార్ట్‌మెంట్, విదేశాంగశాఖలయొక్క పాలసీ విఫలమైనదనీ, దీనికి ప్రతిఫలంగా అసంతృప్తి పెరిగిపోతోందని ఎంతో కష్టంతో కొద్దోగొప్పో రాయక తప్పటం లేదు. ఉదాహరణకు "డెయిలీ టెలిగ్రాఫ్ అండ్ మార్నింగ్‌పోస్టు" పత్రిక యొక్క రాజకీయవిలేఖరి యిలా రాశాడు. పారిస్ సమావేశంలో పాల్గొన్న కొన్ని రాజ్యాలు - అమెరికన్, బ్రిటిష్, ఫ్రెంచి ప్రభుత్వాలు అనటం యింతకన్నా సమంజసంగా వుంటుంది - "జర్మనీ విషయంలో వారు ప్రతిష్టంభనలో కూరుకుపోయారని గుర్తించటం వలననే" కొంతవరకు ఒడంబడిక కుదిరినదని చెప్పవచ్చు.

దీనికన్నా ముఖ్యమైన విషయం న్యూయార్క్ హెరాల్డ్ ట్రిబ్యూన్‌లో జర్మనీ సమస్యపైన ఆంగ్లో - అమెరికన్ విధానం దివాళాకోరుతనాన్ని ప్రదర్శించుకొందనివాల్టర్‌లిప్‌మన్‌పరోక్షంగా అంగీకరించటం, ఇతను యీ పత్రికకు వాట్ స్ట్రీట్ తరఫున ఘంకా కాలమిస్ట్, బజాయిస్తూ వుంటాడు.)

జర్మనీ వ్యవహారాల్లో అగ్రరాజ్యాల పలుకుబడి చాలావరకు తగ్గిపోయిందని. "జర్మనీ సమస్యపై అధికారం వారిచేతుల నుంచి జారిపోయింది" అని జర్మనీ సమస్యను పరిష్కరించడంలో వారు తమ అసమర్థతను ప్రకటించుకొన్నారనీ ఇంకా ఏమోమో వ్రాశాడు. "అగ్రరాజ్య చతుష్టయం యొక్క అసమర్థత"ను గురించిన ప్రశక్తి తెచ్చినప్పుడు లిప్‌మన్ జర్మనీలో పశ్చిమ "అగ్రరాజ్యత్రయం" ప్రదర్శించిన అసమర్థతను మరుగు పరచడానికి నానా అవస్థపడి ప్రయత్నిస్తున్నాడు. ఈవిధంగా ప్రయత్నించడం ద్వారా అతడు అమెరికా కొత్తగా నిర్లక్ష్యంగా వేస్తున్న అభివృద్ధి నిరోధక ప్లానులను బట్టబయలు చేయకుండా మోసగిస్తున్నాడు.

"విదేశాంగ మంత్రులు చేయజాలనటువంటి, చేయడానికి తగిన సూచనలను కూడా ప్రతిపాదించ లేనటువంటి విషయాలను జర్మన్లు జటిలమైన బహిరంగమైన రహస్యమైన ఎత్తుల ద్వారా, ఒకపక్షాన్ని మరోపక్షం పైకి కవ్వించడం ద్వారా చేస్తారు." అని లిప్‌మన్ చెప్పుతున్నాడు.

జాతుల భద్రతనూ, శాంతినీ కాపాడే విధంగా జర్మనీసమస్యను పరిష్కరించడం ఒక్కటే సరియైన మార్గం. ఇందుకు అంతర్జాతీయ సహకారం అవసరం. అలాంటి సహకారానికి ప్రయత్నించడానికి బదులుగా దోషభూయిష్టమైన వర్సలీస్ పాలసీని తిరిగి చేపట్టడమే సరియైన మార్గం అని లిప్‌మన్ ప్రచారం చేస్తున్నాడు. వర్సలీస్ పాలసీ ఇదివరకే జర్మనీ దురాక్రమణకు దారితీసింది. ప్రపంచాన్ని ఒక మహావిపత్తులో ముంచివేయడానికి కారణభూతమయింది. ఈ విధంగా చేయడంద్వారా లిప్‌మన్ పాశ్చాత్య రాజ్యాలు ఆచరణ సాధ్యమైన కార్యక్రమాన్ని అవలంబించడంలో విఫలమయ్యాయని బట్టబయలు చేసుకోడమే కాకుండా ఆరాజ్యాల రాజకీయాలోచనా శూన్యతనుకూడా బైట బెట్టుకున్నాడు. ఈ రాజకీయాలోచనా శూన్యత వాళ్ళను అంధకార బంధురమైన అయోమయంలోకి

ఈడ్చింది. దానినుంచి బైటబడడానికి వాళ్ళకు సరియైన మార్గమేదీ గోచరించడంలేదు.

జర్మనీ సమస్యపై ఆంగ్లో-అమెరికన్ పాలసీ ఒక గ్రుడ్డిసమ్మోళనతో స్పష్టంగా మిళితమై ఉంది. పెట్టుబడిదారీ ప్రపంచంలో రోజురోజుకు తీవ్రతరమవుతూ ఉన్న ఆర్థిక సంక్షోభంయొక్క నేపథ్యం (బేక్‌గ్రౌండ్)లో ఆ పాలసీయొక్క దివాళాకోరుతనం రోజురోజుకు మరింత స్పష్టంగా వెల్లడి అవుతుంది.

అమెరికాలో అనివార్యంగారానున్న ఆర్థిక సంక్షోభాన్ని గురించీ అంతర్జాతీయంగా అందువల్ల కలిగే ఫలితాలను గురించీ మార్క్సిస్టులు చెప్పిన భవిష్యద్వాణిని అమెరికా పాలకవర్గాలు వ్యంగ్యంగా ఎగతాళిచేసి ఇంకా ఎంతో కాలం గడవలేదు. అమెరికా పత్రికలూ అధికారులూ ఇప్పుడా వ్యంగ్య ధోరణిని విరమించుకున్నారు. యునైటెడ్ స్టేట్స్‌లో ఆర్థిక సంక్షోభం అనేది ఇప్పుడు ఊహాగానానికి సంబంధించిన విషయంకాదు. వాస్తవికంగా ఈరోజు కండ్లకు గట్టినట్టు కనపడుతూన్న విషయం. ఆర్థిక సంక్షోభంయొక్క ఫలితాలను, పశ్చిమయూరప్ దేశాలు-ముఖ్యంగా గ్రేట్‌బ్రిటన్-బాగా అనుభవిస్తున్నాయి. ఆర్థిక సంక్షోభంయొక్క ప్రస్తుత దశలో మార్కెట్లకోసం జరిగే పోరాటం రోజురోజుకు తీవ్రతరమవుతూ ఉంది. అధికారులు చేసేప్రకటనలలో సైతం ఈ సంగతులు స్పష్టంగా బైటపడుతున్నాయి. జూన్ 23వ తేదీన అమెరికా ఆర్థిక శాఖాసహాయక మంత్రి అయిన థార్ప్ తన భావకవితా భాషలో ఇలా ప్రకటించాడు:

"అంతర్జాతీయ ఆర్థికసంబంధాలలో యుద్ధానంతర మధురస్వప్నానికి సంబంధించినకాలం సమాప్తంగాబోతూఉంది. ఆర్థికరంగంలో పరస్పర సహకారం ప్రదర్శించుకోవడంలో వివిధజాతులు ప్రదర్శించే శక్తిసామర్థ్యాలనూ, అభిలాషనూ, భవిష్యత్తు ఇంకా కఠినంగా పరీక్షించబోతూ ఉంది."

"ఆర్థికరంగంలో సహకారం" అనే మాటను ఇక్కడ పూర్తిగా అమెరికా దృష్టిలోనే అన్వయించుకోవలసి ఉంటుందని వేరే చెప్పనవసరంలేదు. అంటే దురాశాపూరితమైన మార్షల్‌ప్లాను అధికారానికి పశ్చిమయూరప్ దేశాలు లోబడి ఉండవలసివస్తుంది. ఈ పశ్చిమయూరప్ దేశాలు తూర్పుయూరప్ దేశాలతో వర్తకసంబంధాలను తెగతెంపులు చేసుకోవలసిందిగా మార్షల్‌ప్లాను వాటిని ఒత్తిడిచేస్తుంది. పశ్చిమయూరప్ దేశాలను మార్షల్‌ప్లాను పీల్చిపిప్పిచేస్తుంది. ఈ అధికారం - మార్షల్‌ప్లాను అధికారం - ఒక కఠిన పరీక్షకు గురికాబోతూఉంది. నిజమే.

తూర్పుయూరప్‌కు వ్యతిరేకంగా వాషింగ్టన్‌చే పశ్చిమయూరప్ దేశాలపై విధించబడే వ్యాపారపరతుల్లోని హ్రస్వదృష్టితోగూడిన పాలసీ ఓం ప్రథమంగా పరీక్షకు గురిగాబోవడంలో ఆశ్చర్యమేమీలేదు. వ్యాపారంలో కనపరచే ఈ పక్షపాతంవల్ల పశ్చిమయూరప్ ప్రజల ముఖ్య ప్రయోజనాలు విశేషంగా నష్టపడతాయి అని మా పత్రికలో పదేపదే హెచ్చరించడం జరిగింది. యూరప్‌ను విభజించే ప్రమాదకరమైన పాలసీని కొనసాగించడం అంతర్జాతీయ సహకారాన్ని

విచ్ఛిన్నం చేయడం పెట్టుబడిదారీ దేశాల్లో సంక్షోభం ఇంకా తీవ్రతరం కావడానికీ మార్కెట్లుకోసం జరిగే పోటీని ఇంకా పెంచడానికీ, నిరుద్యోగ సమస్యను ఇంకా పెద్దదిచేయడానికీ తోడ్పడతాయి అనే విషయాన్ని ఈ నాడు అంధుడుకూడా స్పష్టంగా చూడగలుగుతున్నాడు.

పెట్టుబడిదారీ ప్రపంచంలో తీవ్రతర మవుతూవున్న ఆర్థిక సంక్షోభం అంతర్జాతీయ పరిస్థితుల్లో తప్పకుండా గొప్ప మార్పులను కలిగిస్తుంది. పత్రికలుకూడా ఈ విషయాన్ని సూచనప్రాయంగానైనా అంగీకరించవలసి వస్తోంది. ప్యారిస్ సమావేశ ఫలితాలను సమీక్షచేస్తూ న్యూయార్క్ టైమ్సు పత్రికా ప్యారిస్ విలేఖరి మెక్ కార్మిక్ ఇలా వ్రాస్తున్నాడు.

"నేడు ఈ ఖండాన్ని ఆవరించిన ప్రధానభయం యుద్ధ భయంకాదు. అమెరికా మాంద్యం (మరోమాటల్లో చెప్పాలంటే ఆర్థిక సంక్షోభం) యొక్క భయమే ఇక్కడ ప్రధానంగా ఆవరించిఉంది......రాజకీయ సమావేశాలకంటె ఆర్థిక ప్రమాణం పైనే (బరోమీటర్) ఇకముందునుంచి దృష్టి ప్రధానంగా కేంద్రీకరించబడుతుంది."

సంక్షోభం ఈ విధంగా తీవ్రతరం కావడంతోపాటు వాళ్ళల్లోవాళ్ళకు విభేదాలుకూడా తీవ్రతరం కావడం మనకు స్పష్టంగా కనిపిస్తూఉంది. కాని పశ్చిమ రాజ్యాల రాజకీయ నాయకులుమాత్రం తమలో పూర్తిగా ఏకాభిప్రాయం ఉన్నట్లే పైకి నటిస్తున్నారు. జర్మనీ సమస్యపై పశ్చిమ రాజ్యాలు ఇదివరకెన్నడూ లేనంత ఎక్కువగా ఏకాభిప్రాయం కలిగిఉన్నాయి అని ప్యారిస్ మీటింగ్‌లో ఆచిసన్ పదేపదే చేసిన ప్రకటనలు ఆ రాజ్యాల్లో ప్రధాన సమస్యలపై - జర్మనీ సమస్యపైకూడా - రోజురోజుకు పెరిగిపోతూవున్న విభేదాలను కప్పిపుచ్చలేవు. ప్యారిస్ సమావేశాన్ని గురించి పశ్చిమరాజ్యాల పాలక శిబిరంలోని పత్రికలు పట్టిపట్టి తూచి వ్రాసిన వ్రాతలుకూడా "పశ్చిమరాజ్యాల ఐక్యత"లో "అట్లాంటిక్ కూటమి"లో ఏర్పడిన విభేదాలనూ, చీలికలనూ కప్పిపుచ్చలేక పోయాయి.

అమెరికా ప్రభుత్వం జర్మనీపట్ల అవలంబించే పాలసీ ఊబిలో దిగబడ్డది. అనే యధార్థం ప్రపంచం అంతటికీ స్పష్టంగా విదితం అయింది. అమెరికాలో సైతం అసంతృప్తి పెరిగిపోతూఉంది. ఈఊబిలోనుంచి బైటబడడానికి అమెరికా విదేశాంగ విధానం యూరప్‌లో ముఖ్యంగా పశ్చిమ జర్మనీలో నూతనంగా సాహస కృత్యాలకు దిగబోతూ ఉందని సామ్రాజ్యవాదుల కరుడుగట్టిన ప్రతినిధులే అభియోగం తెస్తున్నారు. ముఖ్యంగా పత్రికల్లో ప్రకటించబడిన ఈ క్రింది వార్త ద్వారా ఇది స్పష్టమవుతూఉంది. స్టేట్ డిపార్ట్‌మెంట్ సలహాదారు అయిన జార్జి కెన్నన్, జర్మన్ ఆస్ట్రియన్ వ్యవహారాలకు సంబంధించిన స్టేట్ డిపార్ట్‌మెంట్ ఆఫీసు డైరెక్టరయిన రాబర్ట్ ముర్ఫీ "యూరప్‌లో రాజకీయ సమానత్వం"పై ఆచిసన్‌కూ ట్రూమన్‌కూ ఒక మెమోరండం అందజేశారు. జర్మనీలోని పశ్చిమ ప్రాంతాలను పశ్చిమ యూరప్ కంతటికీ ఆర్థిక రాజకీయ కేంద్రంగాచేసి తద్వారా దానిని "యూరప్‌లో ప్రధానశక్తి"గా చేయాలనీ ఆ మెమోరండంలో సిఫార్సు చేయడం జరిగింది. ఈ ఆశయాన్ని సాధిం

చడంకోసం మార్షల్ ప్లాను కోటాలను పూర్తిగామార్చివేయాలనీ, తదితరమార్షల్ దేశాల కోటాలను తగ్గించి పశ్చిమజర్మనీకి ఎక్కువ కోటాలనుఅంద జేయాలనీకూడా అందులో సూచించబడింది - కెన్నన్ మర్ఫీ మెమోరండం బ్రిటన్‌కు వ్యతిరేకంగా ఉద్దేశించబడింది. ప్రపంచ సమానతకు బ్రిటన్ వేసే ప్లానులు ప్రమాదకరములని వాళ్ళ ఉద్దేశం.

బ్రిటన్ తన ఆర్థిక దుస్థితిని గురించి ఇప్పటికే ఆందోళన చెందుతూఉంది. భవిష్యత్తులో కూడా తన ఆర్థికాభివృద్ధికి శుభ సూచనలేమీ కన్పడడం లేదు. ప్రపంచ మార్కెట్‌లో పశ్చిమ జర్మనీ యొక్క పోటీని పునరుద్ధరించడంవల్ల తనకు ఒరిగేదేమీ లేదని బ్రిటన్ గ్రహిస్తూ ఉంది. యుద్ధానికి పూర్వపు స్థాయికంటె ఇంకా చాలా తక్కువ స్థాయిలోనే పశ్చిమ జర్మనీ పరిశ్రమలుఉన్న ఈనాడు కూడా అమెరికన్ గుత్త పెట్టుబడి ఆధ్వర్యాన నడిచే జర్మనీ పరిశ్రమలను చూచి బ్రిటిష్ వ్యాపారస్థులు విపరీతంగా భయపడుతున్నారు. కెన్నన్—మర్ఫీ మెమోరండంలాంటి డాక్యుమెంట్లు బ్రిటన్‌లో ఎలాంటి భావాలను ప్రకోపింపజేస్తాయో ప్రతివాడూసులభంగాఊహించుకోవచ్చు.

ప్రపంచాధిపత్యం కోసం అర్రులుజాచే అమెరికా సామ్రాజ్యవాదులు తమకు అండగా ఉండేందుకు జర్మనీ సామ్రాజ్యాన్ని సాయుధంగా తయారు చేస్తున్నటువంటి అమెరికా పాలసీతో ఆగ్రహావేశ పూరితులైన ఫ్రెంచిప్రజల ఒత్తిడికి ఫ్రెంచి పాలక వర్గాలు గురి అవుతున్నాయి.

వాస్తవిక పరిస్థితులు ఇలా ఉంటే ప్యారిస్ సమావేశంలో పశ్చిమ రాజ్యాల "ఐక్యత దృఢతరం అయింది." అని డెస్నీ, ప్యారిస్ విలేఖరి స్క్రిప్స్ హోవార్డ్ లాంటివారు ప్రకటించడం ఎంతైనా హాస్యాస్పదం.




యుద్ధానంతర సమస్యలను "అగ్ర రాజ్య చతుష్టయం" పరిష్కరించటం సాధ్యమేనన్న విషయాన్ని ప్యారిస్ సమావేశం స్పష్టంచేసింది. ఈ సమావేశంలో జరిగిన ఒడంబడికల పాత్ర పరిమితమైనప్పటికి, యీ వాస్తవిక విషయం చాలా ప్రధానమైంది. ప్రాముఖ్యమైనది. పశ్చిమ రాజ్యాలు సోవియట్ యూనియన్‌ల మధ్య సహకారం అసంభవం అని అనటం వట్టి శుద్ధాబద్ధమైనదని ఆచరణలో తేలిపోయింది. ఈ విషయం వలననే ప్యారిస్ సమావేశం ప్రపంచశాంతికి, అగ్రరాజ్యాలమధ్య సహకారానికి శత్రువులైన వారిచే అంతర్జాతీయంగా కల్పించబడిన ఉద్రిక్త పరిస్థితిని పై కారణం వలననే ప్యారిస్ సమావేశం కొంతవరకు తొలగించింది.

అయితే యుద్ధోన్మాదులు యీ అపజయాన్ని కిమ్మనకుండా అంగీకరిస్తారని అనుకోవటం అవివేకమే అవుతుంది. జర్మనీ దేశానికి సంబంధించిన ప్రధాన సమస్యలు ప్యారిస్ సమావేశంలో పరిష్కరించబడని కారణంవల్ల కొత్తగా కుట్రలు పన్నటానికి వారికి ప్రోత్సాహం యిస్తోంది. ఈ రాజ్యాలమధ్య సహకారం పొసగకుండా దెబ్బతీయటానికి శాంతికి

వ్యతిరేకమైనవారు, వారి ప్రయత్నాలను కొనసాగిస్తారు. అమెరికన్ రక్షణ శాఖా కార్యదర్శి జాన్సన్ జూన్ 21 వ తేదీన యిచ్చిన ప్రకటనే దీనికి ప్రబల తార్కాణం. ఆయుధ నిర్మాణాన్ని కొనసాగించ వలసిందిగా చెప్పుతూ నికారసయిన సోవియెట్ వ్యతిరేక పచ్చి అబద్ధాలను తిరిగి వల్లించాడు.

ఫారెస్టల్ వారసుడుగా యితను అదే వేడిలో "కమ్యూనిస్టు ప్రపంచం, కమ్యూనిస్టేతర ప్రపంచం" మధ్యసహకారం అసంభవమని సోవియట్ యూనియన్ భావిస్తోందని డబాయించాడు. రెండు విధానాలమధ్య సహకారం అసంభవమని భావించేది సోవియట్ రాజకీయవేత్తలు కాదనీ, అమెరికన్ రాజకీయ వేత్తలేననీ, సోవియట్ పత్రికలు కాదనీ, అమెరికన్ పత్రికలేననీ ఎవరికి తెలియదు ? ఫారెస్టల్ నడచిన మార్గాన్నే నడచి, జాన్సన్ చివరకు పిచ్చాసుపత్రిలో చేరతాడో లేదో చెప్పటం కష్టమైనప్పటికి, అలా జరగటానికి చక్కటి అవకాశాలను మాత్రం కలుగచేసుకుంటున్నాడు.

కోటానుకోట్ల ప్రజలను పట్టుకొని పీడించే ప్రశ్నయిది. అగ్రరాజ్యాల మధ్య పాక్షిక ఒడంబడిక సాధ్యమైనప్పుడు, జర్మనీ సమస్య అంతటిపైనా-జర్మనీయొక్క ఆర్థిక, రాజకీయఐక్యతను పునస్థాపించడం, అఖిల జర్మన్ ప్రజాస్వామిక ప్రభుత్వాన్ని స్థాపించటం, ఆదేశంతో శాంతిసంధి చేసుకోవటం - ఒడంబడిక కుదుర్చుకోవటానికి వచ్చిన అడ్డంకి ఏమిటి ?

పశ్చిమరాజ్యాల అధినేతలు యీ ప్రశ్నకు సమాధానం చెప్పాల్సిన అవసరాన్ని గుర్తించారు. కాని యీ ప్రశ్నకు సమాధానంగా ప్రెడిడెంట్ ట్రూమన్ కాని, స్టేట్ కార్యదర్శి అఛిసెన్ కాని యిచ్చిన ప్రకటనలు సంతృప్తిని కల్గించలేకపోయాయి.

ప్యారిస్ సమావేశంపైన 'పకటన' చేస్తూ ట్రూమన్ పశ్చిమ రాజ్యాలు "ముందు చూపుగల్గిన విధానాన్ని ఉద్దేశించి ఐక్యతకు మార్గాన్ని చూపాయి" అని చెప్పటంలోయితనికీ సత్యానికీ మధ్య, నరకానికీ నాకలోకానికి మధ్య వున్నంత తేడా వుంది. మొదటి విషయం పశ్చిమ రాజ్యాలు ఉద్దేశించిన కార్యక్రమం ముందు చూపుతో కూడుకున్నట్టిది కాదు. బ్రిటిష్, అమెరికన్ గుత్త వ్యాపార సంస్థల ఛత్రచ్ఛాయలనీడ దురాక్రమణ చింతతో కూడిన జర్మన్ సామ్రాజ్య వాదాన్ని పునస్థాపించాలని ఆ కార్యక్రమంలో ఉద్దేశింపబడింది. కనుక అది వెనక చూపుతో కూడినట్టిది. అభివృద్ధి నిరోధకతత్వం కల్గినట్టిది. ఇక రెండో విషయం దీనినుంచి తేలేదేమిటంటే యిటువంటి కార్యక్రమాన్ని 'సమైక్యతకు పునాదిగా' పరిగణించటానికి వీలులేదు. అందువల్ల యీ కార్యక్రమం ఒక్క సోవియట్ యూనియన్‌కే గాక, జర్మనీ దేశ సరిహద్దునవున్న యితర యూరపియన్ దేశాలకు కూడ అంగీకార యోగ్యమైనట్టిది కాదు. ఎందువల్లనంటే యీ కార్యక్రమంలో ఆ దేశాల భద్రతకు భంగం వాటిల్లే ప్రమాదం గర్భితమైవుంది. కనుక ఒడంబడికను సాధించే వుద్దేశంతో కాక, అందరికే అంగీకార యోగ్య ఒడంబడిక ప్యారిస్ సమావేశంలో సాధ్యపడకుండా చెడగొట్టాలనే ఉద్దేశంతో మొదటినుంచీ యీ కార్యక్రమం ప్రతిపాదించబడుతూ వచ్చింది. అయినప్పుడు ట్రూమన్ డబాయించి

నట్లు "యావత్తు జర్మనీదేశంయొక్క అవసరాలను తీర్చుతూ అన్ని రాజ్యాల ప్రయోజనాలను రక్షించే నిర్మాణాత్మకమైన కార్యక్రమాన్ని రూపొందించాలన్న తీవ్రతృష్ణతో అమెరికన్ ప్రతినిధి వర్గం ప్యారిస్ సమావేశానికి హాజరయింది" దబాయించటం ఎలా సాధ్యపడుతుంది? ఇటువంటి దబాయింపు సత్యానికి పంగనామాలు పెట్టటం కాదా?

"రెండో ప్రక్క సోవియట్ యూనియన్ పోట్స్డం నిర్ణయాలకు, దాని విధానానికి మరలాలని పట్టుపట్టినది." అంటూ ట్రూమన్ అది 'ఆచరణ నీయమైనది' కాదని బూజుపట్టిపోయిన వాదనను మళ్ళీ లేవనెత్తాడు. అయితే ప్యారిస్ సమావేశం యొక్క చర్చలు ఫలితాలు దీనికి వ్యతిరేకంగా ప్రదర్శితంకాలేదా? చాట్రి పోట్సుడం నిర్ణయాలను ఆధా౦ం చేసుకున్న పక్షంలో మాత్రమే జర్మనీకి సంబంధించిన ఏ సమస్య అయినా పరిష్కారం అవుతుందనీ, యీ నిర్ణయాలను కాలదన్నటానికి చేసే ప్రతి ప్రయత్నం పురోగమనానికి అవరోధం కల్గించుతుందనీ, ప్యారిస్ సమావేశం రుజువు చేయలేదా? పోట్సుడం నిర్ణయాలపై ఆధారపడి తయారు చేయబడిన సోవియట్ ప్రతిపాదనలు సూచించే మార్గాన్ని ప్యారిస్ సమావేశంలో పశ్చిమ రాజ్యాలు స్వీకరించక తప్పలేదన్న విషయం యదార్థం కాదా?

ప్యారిస్ సమావేశ ఫలితాలపైన ముచ్చటిస్తూ స్టేట్ కార్యదర్శి అఛిసెన్ యీ సందర్భాన్ని కూడ ఉపయోగించుకోవచ్చుననుకొన్నాడు. ఈ సమావేశం ఉత్తర అట్లాంటిక్ సంధియొక్క అత్యంత ప్రాముఖ్యతను వక్కాణించిందన్నాడు. ప్రస్తుతం సమావేశమవుతున్న కాంగ్రెస్ లోనే సైనిక సహాయ కార్యక్రమాన్ని అంగీకరించాల్సిన అవసరాన్ని నొక్కి చెప్పుతోందన్నాడు. సకలదేశాలలోవున్న కోటానుకోట్ల ప్రజలకు తెలిసిన వాస్తవిక విషయాలను కప్పిపుచ్చటం ఎవరితరమూ కాదు. వాషింగ్టన్ యొక్క విదేశాంగ విధానం—దురాక్రమణ దురాలోచనతో కూడిన ఉత్తర అట్లాంటిక్ సంధిలోనూ, సైనిక సహాయ కార్యక్రమంలోనూ మూర్తీభవించినట్లు— అంతర్జాతీయ సహకారానికి, ముఖ్యంగా జర్మనీకి సంబంధించిన ప్రధాన సమస్యల పరిష్కారానికి అవరోధం కల్గిస్తోందని యీ వాస్తవిక విషయాలు తెలియ చేస్తున్నాయి. ఒక ప్రక్క ప్యారిస్ నిర్ణయాలను బలపర్చుతూనే, మరో ప్రక్క ఆ నిర్ణయాల స్వభావానికి వ్యతిరేకమైన చర్యలకు పూనుకోవటం ఎలా సాధ్యపడుతుంది?

జర్మనీ సమస్యను పరిష్కరించటానికి గల అవరోధానికి మూలకారణమేమిటో, అంతర్జాతీయ సహకారానికి, శాంతిని సుస్థిరం చేయటానికి గల అవరోధానికి మూలకారణమెక్కడవుందో సహృదయులకు యీ అవకతవక ప్రవర్తన కనువిప్పు కల్గిస్తోంది.

అఛిసెన్, ట్రూమన్ - యీ యిద్దరూ కూడ ప్యారిస్ సమావేశంలో అమెరికా 'ఖచ్చితమైన పాలసీ' అవలంబించటం వల్లనే పురోగమనం సాగిందనే భావం కల్గించటానికి ప్రయత్నం చేశారు. అఛిసెన్‌ను నమ్మవలసివస్తే, అమెరికాయొక్క 'ఖచ్చితమైన పాలసీ' పుణ్యమా అంటూ "విదేశాంగమంత్రుల సమావేశం పిలవ

బడటం, ఆ సమావేశ కార్యక్రమాన్ని నెరవేర్చటం" జరిగిందనాల్సి వుంటుంది. స్టేట్ డిపార్ట్‌మెంట్ 'ఖచ్చితమైన పాలసీ' అని విపరీతంగా డబ్బా వాయించబడ్డ యీపాలసీవల్ల సంవత్సరంన్నరపాటు విదేశాంగ మంత్రుల కౌన్సిల్ సమావేశం సాధ్యపడలేదన్న విషయం ఎవరికి తెలియదు? అమెరికా ప్రభుత్వంయొక్క 'ఖచ్చితమైన పాలసీ' అని చెప్పబడుతున్న దానిని ప్యారిస్ సమావేశం తమ్ముచేసినదనటం సబబుగా వుండదా?

అమెరికా అవలంబించుతున్న 'యుద్ధప్రేరక' (కోల్డ్‌వార్) పంథా నిరుపయోగమనీ, నిష్ప్రయోజనమనీ ప్యారిస్ సమావేశఫలితాలు ఋజువుచేస్తున్నాయని మతిచెడని ప్రతివానికి బోధపడుతోంది.

అంతర్జాతీయ సహకారానికి చిత్తశుద్ధితోకూడిన సూత్రాలు - ఆచరణలో వడబోయబడిన సూత్రాలు - స్వీకరించటం ద్వారానే యుద్ధానంతర సమస్యల పరిష్కారానికీ, శాంతిని సుస్థిరంచేయటానికీ, జాతులభద్రతకు దారితీస్తుందని యీ నిర్ణయాలు తెలియచేస్తున్నాయి.

[న్యూటైమ్సు (27) (29-6-49)]

"మానవజాతి వర్గాలుగా ఎప్పుడైతే విడిపోయిందో అప్పుడే 'సర్వమానవప్రేమ' అనేది పోయింది. నేడు అధికారంలో ఉన్న వర్గాలు ఈ నినాదాన్ని తీసుకుంటున్నాయి. కాన్‌ఫ్యూయస్, టాల్‌స్టాయి ఈ సిద్ధాంతంకోసమే కృషిచేశారు. కాని ఎవ్వరూ సాధించలేకపోయారు. ఎందుకంటే ఈ వర్గసమాజంలో నేడది సాధ్యమయ్యేదికాదు. అయితే నిజమైన సర్వమానవప్రేమ అనేది సాధ్యంకానేకాదా? అని అడగవచ్చు. అది సాధ్యమవుతుంది. కాని నేడుకాదు. ప్రపంచమంతటా వర్గవిభేదాలు నిర్మూలించబడిననాడే అది సాధ్యమవుతుంది. ఈ వర్గాలే సమాజాన్ని చీల్చాయి. ఇది పోతే మానవజాతి తిరిగి ఐక్యమవుతుంది. అప్పుడు సర్వమానవప్రేమ వుంటుంది. అంతవరకూ వుండదు. మనం ఫాసిస్టులను మన శత్రువులను ప్రేమించం. సమాజంలో ఒక దుష్టవిధానాన్నికూడా ప్రేమించం. అలాంటివాటి నన్నిటినీ నిర్మూలించడమే మన ఆశయం.

మావో-సి-టుంగ్

("కళలూ-సారస్వతం ఎవరికోసం" పేజి 30)

# వ్యూహం : ఎత్తుగడలు — స్టాలిన్

["ప్రోబ్లమ్స్ ఆఫ్ లెనినిజం" అనే స్టాలిన్ వ్రాసిన ఉత్కృష్ట గ్రంథాన్నుండి "వ్యూహం : ఎత్తుగడలు" అనే అధ్యాయాన్ని యీక్రింద నిస్తున్నాం. —సంపాదక వర్గం]

ఈ శీర్షిక క్రింద ఆరుప్రశ్నలను తీసికొని వాటికి జవాబులు యివ్వ ప్రయత్నిస్తాను. (1) కార్మికవర్గ పోరాటంలో నాయకత్వమునకు సంబంధించిన శాస్త్రమగు వ్యూహము, ఎత్తుగడలు (2) విప్లవంలోని వివిధదశలు; ఆయాదశల కనుగుణ్యమగు వ్యూహం (3) ఉద్యమంలో కల్గే ఆటుపోట్లు; అందుల కనుగుణ్యంగా ఎత్తుగడలు (4) వ్యూహనాయకత్వం (5) ఎత్తుగడల నాయకత్వం (6) సంస్కరణవాదం విప్లవవాదం: అన్నవి ఈ ఆరుప్రశ్నలు.

## I

## శ్రామికవర్గంయొక్క వర్గపోరాటంలో నాయకత్వమునకు సంబంధించిన శాస్త్రమగు వ్యూహము : ఎత్తుగడలు

కొద్దోగొప్పో శాంతమగు పరిస్థితులలో కార్మికవర్గ బలాలు అభివృద్ధిఅయ్యే దినాలలో రెండవ అంతర్జాతీయసంస్థ (ఇంటర్నేషనల్) పనిజేసింది. పార్లమెంటరీ కార్యక్రమమే వర్గపోరాటంయొక్క ప్రధానరూపంగా వున్నదశ అది. వర్గ పోరాటాలకు, విప్లవ పోరాటాలకు శ్రామికవర్గాన్ని సంసిద్ధం జేయటం, శ్రామికవర్గ నియంతృత్వాన్ని స్థాపించుటకై మార్గాలను వెతకటం మున్నగు పెద్ద ప్రశ్నలు ఆదశలో తక్షణ కర్తవ్యాలు కావు. శ్రామికవర్గబలాలను ఏర్పర్చుటకూ తర్ఫీదు గావించుటకూ అన్ని లీగల్ అవకాశాలనూ వినియోగించుకోవటం; ప్రతిపక్షంలో మాత్రమే వుండే స్థితి కాబట్టి (తప్పనిసరిగా ప్రతిపక్షంగానే వుండవలసిన పరిస్థితులు ఆనాడు వున్నవికూడా) ఆ దశకు అనుగుణ్యంగా శ్రామికవర్గం పార్లమెంటరీ కార్యక్రమాన్ని ఉపయోగించుకోవటం; ఈ కర్తవ్యాలు మాత్రమే అప్పుడు ఎదుర్కొన్నవి. కాబట్టి అటువంటిదశలో, అటువంటి బాధ్యతలను మాత్రమే నిర్వహించవలసిన పరిస్థితులలో సమగమగు వ్యూహంగాని, వివరమగు ఎత్తుగడలనుగాని శ్రామికవర్గం కల్గివుండుట అసాధ్యమని వేరే చెప్పనక్కరలేదు. వ్యూహమునుగూర్చి, ఎత్తుగడలనుగూర్చి అస్పష్టమగు, ఒకదానికొకటి

సంబంధంలేని, అభిప్రాయాలు మాత్రం వుండేవిగాని వ్యూహం, ఎత్తుగడలు అని చెప్పుకోదగ్గవి లేవు.

అయితే, పార్లమెంటరీ పోరాట పద్ధతుల ఎత్తుగడలను అవలంబించటంలో లేదు రెండవ అంతర్జాతీయసంస్థ చేసిన మహాపరాధం. అది ఈఎత్తుగడల ప్రాముఖ్యతను మరింత హెచ్చుగా అంచనా వేసింది. అదొక్కటే పోరాట పద్ధతిగా భావించింది. బహిరంగ విప్లవపోరాటముల దశ ప్రారంభమై, శాసనసభల బయట జరుగు పోరాటములను సాగించవలసిన ప్రశ్న అత్యంత ప్రధానమైనప్పుడుకూడా రెండవ ఇంటర్నేషనల్‌కు జెందిన పార్టీలు ఈ నూతన కర్తవ్యాల యెడ పెడముఖం పెట్టి, నిర్వహించ నిరాకరించినవి. రెండవ ఇంటర్నేషనల్ చేసిన మహాపరాధంఇదే.

ఆతర్వాత దశలోనే కార్మికవర్గం ప్రత్యక్ష కార్యాచరణకు పూనుకొన్న దశలోనే, శ్రామిక వర్గ విప్లవదశలోనే, బూర్జువావర్గాన్ని కూలద్రోయు ప్రశ్న తక్షణకర్తవ్యంగా ఉదయించినదశలోనే, శ్రామికవర్గంయొక్క రిజర్వులకు సంబంధించిన ప్రశ్న (వ్యూహం) అత్యంత ప్రధానమగు ప్రశ్నగా తయారైన దశలోనే, పార్లమెంటులలోను, పార్లమెంటులకు బయట జరిగే పోరాటు రూపములు, నిర్మాణ రూపములు (ఎత్తుగడలు) పూర్తిగా వ్యక్తీకరించబడి, ఒక రూపాన్ని పొంది నప్పుడే—ఇటువంటి దశలోనే, కార్మికవర్గ పోరాటంలో అనుసరించదగిన సమగ్రమగు వ్యూహము, వివరమగు ఎత్తుగడలు రచించటం సాధ్యంకాగలదు. రెండవ ఇంటర్నేషనల్‌కు సంబంధించిన అవకాశవాదులచే మరుగుపర్చబడిన మార్క్సు ఎంగెల్సుల అద్భుతమగు వ్యూహం, ఎత్తుగడలకు సంబంధించిన సిద్ధాంతాలు సరిగ్గా ఈ దశలోనే లెనిన్‌చే బహిర్గతం చేయబడినవి. అయితే ఎత్తుగడల గూర్చి ఈ మార్క్సు, ఎంగెల్సులు ప్రతిపాదించిన సూత్రములను వల్లె వేయటంతో లెనిన్ ఊరుకొనలేదు. వాటినింకా అభివృద్ధి పర్చి, నూతన అభిప్రాయాలతోనూ, సూత్రాలతోనూ బలపర్చాడు. శ్రామిక వర్గం జరిపే వర్గపోరాటంలో నాయకత్వం అనుసరించదగు సూత్రములను, నిబంధనలను శాస్త్రీయ పద్ధతిగా జతపర్చాడు. "ఏమిచేయాలి" "రెండు ఎత్తుగడలు" "సామ్రాజ్యవాదము" "రాజ్యాంగయంత్రము, విప్లవము" "శ్రామికవర్గ విప్లవం, ద్రోహియగుకాట్స్కీ" "అతివాద శిశువ్యాధికం" మున్నగు లెనిన్ విరచిత గ్రంథాలు మార్క్సిస్టు విజ్ఞానకోశానికి జేర్చబడిన వెలలేని రత్నాలుగా, విప్లవ ఆయుధాగారానికి జేర్చబడిన మహాస్త్రములుగా పరిగణింపబడ గలవు. శ్రామికవర్గ విప్లవ పోరాటంలో నాయకత్వమునకు సంబంధించిన శాస్త్రమే లెనినిజంయొక్క వ్యూహం, ఎత్తుగడలు.

# II
# విప్లవదశ: వ్యూహము

విప్లవంయొక్క ఒకానొక దశలో శ్రామికవర్గం ప్రధానమగు దెబ్బను ఏ దిక్కుగా కొట్టాలి, అనే విషయాన్ని నిర్ధారణగావించటం; ఇందుకనుగుణ్యంగా విప్లవశక్తులను (ప్రధానమగు, ద్వితీయమగు రిజర్వులను) మోహరించుటకై ప్లానును ఏర్పర్చటం; విప్లవంయొక్క ఆ దశయంతటా ఈ ప్లానును అమలు జరుపుటకై పోరాడటం; ఇదే వ్యూహం.

మన విప్లవం ఇప్పటికి రెండు దశలను గడిచినది: అక్టోబరు విప్లవం తర్వాత మూడవదశలో ప్రవేశించినది. మన వ్యూహం గూడా అందుకనుగుణ్యంగా మారినది.

ప్రథమదశ : 1903 నుండి 1917 ఫిబ్రవరి వరకు : ఈ దశలో లక్ష్యం : జారు వ్యవస్థను కూలద్రోయటం, మధ్య యుగాలనాటి చిహ్నాలనుపూర్తిగాతుడిచి పెట్టటం. విప్లవం యొక్క ప్రధానశక్తి : శ్రామికవర్గం. అందుబాటులోని రిజర్వు: రైతాంగం. ప్రధానమగు దెబ్బకొట్టవలసిన దిక్కు : రైతాంగమును. తమ వైపుకు ఆకర్షించటం, జారువ్యవస్థతో రాజీపడుటద్వారావిప్లవాన్ని అంతమొందించటం, వీటికొరకై ప్రయత్నిస్తు లిబరల్—మొనార్కిస్టు బూర్జువావర్గాన్ని ప్రజల నుండి దూరంచేయటం. విప్లవశక్తులను మోహరించుటకై ప్లాను శ్రామికవర్గం రైతాంగముయొక్క మిత్రత్వమును సంపాదించటం.

"నిరంకుశాధికారవర్గం ప్రతిఘటనను బలప్రయోగంతో అణచివేయుటకూ, బూర్జువా వర్గంయొక్క అస్థిరత్వాన్ని స్తంభింపజేయుటకూ రైతాంగ జనబాహుళ్యంతో కలిసి, శ్రామికవర్గం ప్రజాతంత్ర విప్లవాన్ని పూర్తిగావించాలి.

—సెలెక్టడ్‌వర్క్సు, సంపుటి 3 పేజీ110

రెండవదశ : 1917 ఫిబ్రవరినుండి 1917 అక్టోబరువరకు; లక్ష్యం : రష్యాలో సామ్రాజ్యవాదాన్ని కూలద్రోయటం. సామ్రాజ్యవాద యుద్ధంనుండి వుపసంహరించుకొనటం. విప్లవంయొక్క ప్రధాన శక్తి: శ్రామికవర్గం. అందుబాటులోని రిజర్వు : బీదరైతాంగం. ఇరుగు పొరుగు దేశాలలోని శ్రామికవర్గం బహుశః తోడ్పడగల రిజర్వులు. దీర్ఘంగా సాగుచున్న యుద్ధం, సామ్రాజ్యవాదంలో బయలుదేరిన సంక్షోభం అనుకూల విషయాలు. ప్రధామగు దెబ్బను కొట్టవలసిన దిక్కు : రైతాంగమందలి కష్టజీవులగు ప్రజాసామాన్యాన్ని తమవైపు ఆకర్షించుటకూ, సామ్రాజ్యవాదంతో రాజీపడి విప్లవాన్ని తుదముట్టించుటకూ ప్రయత్నిస్తున్న పెటీ-బూర్జువా డెమోక్రాట్లను (మెన్షివిక్కులను, సోషలిస్టు రివల్యూషనరీలను) ప్రజాసామాన్యంనుండి దూరం చేయటం. విప్లవశక్తులను మోహరించుటకై ప్లాను: బీదరైతాంగంతో శ్రామిక వర్గం మిత్రత్వం.

"బూర్జువావర్గంయొక్క ప్రతిఘటనను బలప్రయోగంతో అణచివేయు

టకూ, రైతాంగముయొక్క, పెటీబూర్జువావర్గంయొక్క అస్థిరత్వమును స్తంభింపజేయుటకూ, ప్రజాబాహుళ్యములోని అర్ధశ్రామికవర్గ శక్తులతో కలిసి, శ్రామికవర్గం సోషలిస్టు విప్లవాన్ని పూర్తిగావించాలి".

(లెనిన్ సెలక్టడ్ వర్క్సు సంపుటి III పేజి III)

మూడవదశ: అక్టోబరు విప్లవానంతరం ప్రారంభమాతుంది. లక్ష్యం: ఒకే దేశంలో శ్రామికవర్గనియంతృత్వాన్ని స్థిరపర్చుట; దీనిని పునాదిగా గొని, అన్నిదేశాల్లోని సామ్రాజ్యవాదాన్ని కూలద్రోయుట. విప్లవం ఒకేదేశం సరిహద్దులను మించి వ్యాపిస్తున్నది. ప్రపంచవిప్లవశకం ప్రారంభమైనది. విప్లవంయొక్క ప్రధానశక్తులు: ఒకే దేశంలోని శ్రామికవర్గనియంతృత్వం, అన్నిదేశాలలోని శ్రామికవర్గ విప్లవోద్యమం – అందుబాటులోని రిజర్వులు: అభివృద్ధిచెందిన దేశాల్లోని అర్ధకార్మిక ప్రజలు, సామాన్య రైతాంగం; వలస దేశాలలోని, పరాధీనదేశాల్లోని స్వాతంత్రోద్యమాలు. ప్రధానమగు దెబ్బను కొట్టవలసినదిక్కు: సామ్రాజవాదంతో రాజీపడే మార్గానికి దోహమిచ్చే రెండవ ఇంటర్నేషనల్ పార్టీలను ప్రజల నుండి దూరంచేయుటం. పెటీ–బూర్జువా డెమోక్రాటులను ప్రజల నుండి దూరంచేయుటం. విప్లవశక్తులను మోహరించుటకు ప్లాను: శ్రామికవర్గవిప్లవం, వలసదేశాలలోని పరాధీనదేశాలలోని స్వాతంత్ర్యమాల మిత్రత్వం.

విప్లవంయొక్క ప్రధానశక్తులకు, దాని రిజర్వులకు సంబంధించినది వ్యూహం. విప్లవం ఒకదశనుండి మరొకదశకు మారటంతో వ్యూహంకూడా మారుతుంది; కాని ఒక్కొక్కదశలోనూ, ఆదశయంతటామాత్రం అది మారకుండా వుంటుంది.

# III

## ఉద్యమం యొక్క ఆటుపోట్లు: ఎత్తుగడలు

ఉద్యమంలో వచ్చే ఆటుపోట్ల స్వల్పకాలంలో, విప్లవంలోని ఉచ్చనీచదశలలో కార్మికవర్గం అనుసరించవలసిన పంథాను నిర్ణయించటం; ఈ పంథాననుసరించి పోరాటమును జరుపుటకై పాత పోరాటపద్ధతులను, పాత నిర్మాణపద్ధతులను వదలి నూతనమైన వాటిని ఏర్పర్చుకొనటం; పాత నినాదాల బదులు నూతన

నినాదాలను అనుసరించటం; వీటినన్నిటినీ సమన్వయ పర్చటం; మున్నగునవే ఎత్తుగడలు. దానినీ విధముగా చెప్పవచ్చును: జారు వ్యవస్థను గాని, బూర్జువా వ్యవస్థను గాని వ్యతిరేకంగా జరిగే యుద్ధంలో విజయం పొందుటయే జారువ్యవస్థలేక బూర్జువా వ్యవస్థలతోటి పోరాటాన్ని కడవరకూ తీసుకొనిపోవుటయే వ్యూహంయొక్క లక్ష్యం. కాని ఎత్తుగడల లక్ష్యంఇంతకన్న తక్కువైనది. వాటిలక్ష్యం, మొత్తం యుద్ధంలో జయించటంగాక, ఏదో ఒకరంగంలో ఏదో ఒక పోరాటంలో జయించటం మాత్రమే. విప్లవంయొక్క వృద్ధిక్షీణతలబట్టి, ఆయా దశలలో అనుసరణీయమగు ఒకానొక పోరాటమును, ఒకానొక కార్యక్రమమును జయప్రదంగా నిర్వహించటమే వాటి లక్ష్యం. వ్యూహంలో ఒకభాగమే ఎత్తుగడలు; ఇవి వ్యూహమునకు లోబడి, దానికి సహాయభూతంగా మాత్రమే వుండగలవు.

విప్లవంలోని ఆటుపోటుల ననుసరించి ఎత్తుగడలు మారుచుండగలవు. విప్లవంయొక్క మొదటిదశ (1903 నుండి 1917) ఫిబ్రవరి యంతటా వ్యూహం మారకుండా వుంటే, ఎత్తుగడలు అనేక పర్యాయములు మారినవి. 1903 నుండి 1905 వరకూ పార్టీ పోరాటు కార్యక్రమమును అవలంబించినది. కారణం, ఈ దశలో విప్లవ ప్రవాహం అతిశయిస్తూవున్నది; ఉద్యమం వుధృతంగా వున్నది. ఈ పరిస్థితుల బట్టియే ఎత్తుగడలు నిర్ణయింపబడాలి. విప్లవ ప్రవాహం అతిశయిస్తూ వున్నది కాబట్టే అందుకనుగుణ్యంగా పోరాటపద్ధతులు కూడా విప్లవ ధోరణిలో వుండవలసివచ్చినవి. స్థానికరాజకీయ సమ్మెలు, రాజకీయ ప్రదర్శనములు, జనరల్ రాజకీయసమ్మె, డ్యూమా * బహిష్కరణ, సాయుధ తిరుగుబాటు, విప్లవపోరాట నినాదాలు- ఇవీ ఆనాటి దశలో ఒకదాని పిమ్మట మరొకటిగా తీసుకొన్న పోరాట రూపములు. పోరాటరూపములలో వచ్చిన ఈ మార్పులకు అనుగుణ్యంగా నిర్మాణ రూపములలో కూడా ఉచితమగుమార్పులు వచ్చినవి. ఫాక్టరీకమిటీలు, విప్లవ రైతు కమిటీలు, సమ్మెకమిటీలు, కార్మిక ప్రతినిధుల సోవియట్లు, కొద్దోగొప్పో బహిరంగంగా పనిజేసే కార్మికవర్గ పార్టీ—ఇవీ ఆనాడు నిర్మాణ రూపాలలో ఒక దాని పిమ్మట మరొకటిగా స్వీకరించబడినవి.

1907 నుండి 1912 మధ్యకాలంలో, విప్లవోద్యమంలో క్షీణతకన్పించినది; విప్లవ ప్రవాహంలో ఆటుకల్గింది. ఎత్తుగడలను నిర్ణయించడంలో ఈ విషయాన్ని తప్పని సరిగా గుర్తించాలి. కాబట్టేపార్టీ తిరోగమనమునకు అవుసరమగు ఎత్తుగడలను అవలంబించ వలసివొచ్చినది. పోరాట పద్ధతులు, అదేవిధంగా నిర్మాణ పద్ధతులు కూడా మారినవి. డ్యూమాను బహిష్కరించటంగాక, డ్యూమాలో ప్రవేశించటం జరిగింది. డ్యూమా వెలుపల బహిరంగంగా నూటిగా సాగించే విప్లవ పోరాటాల బదులు శాసనసభా కార్యక్రమమును, డ్యూమాలోపనిజేయుటనూ, స్వీకరించటం జరిగింది. జనరల్ రాజకీయసమ్మె బదులు స్థానిక పాక్షిక ఆర్థిక సమ్మెలను నడపటం జరిగింది. లేదా, అసలు కార్యకలాపాలలోనే మాంద్యత ఏర్పడింది. ఆదశలో

* రష్యన్ పార్లమెంటు పేరు డ్యూమా

పార్టీ రహస్య జీవితాన్ని (యు. జి) గడపవలసి వచ్చినదని వేరే చెప్పనక్కర లేదు. విప్లవప్రజాసంఘాలస్థానే వైజ్ఞానిక విద్యాసంస్థలు, కోఆపరేటివు, ఇన్సూరెన్సు మున్నగు లీగల్ సంస్థలు వెలసినవి

ఇదేవిధంగా విప్లవం రెండవ, మూడవ దశలలోకూడా ఎత్తుగడలు అనేక డజన్ల పర్యాయములు మారినవి. అయితే వ్యూహములు మాత్రం మారకుండా నిల్చియే యున్నవి.

కార్మికవర్గంయొక్క పోరాట పద్ధతులకు, నిర్మాణ పద్ధతులకు, వాటిలోని మార్పులకూ, కలయికలకూ సంబంధించినవి ఎత్తుగడలు. విప్లవంయొక్క ఒకానొక దశలో, ఆ విప్లవంయొక్క ఆటుపోటులనూ, వృద్ధిక్షీణతలనూ అనుసరించి ఎత్తుగడలు అనేకపర్యాయములు మారగలవు.

# IV
# వ్యూహనాయకత్వం

విప్లవంయొక్క రిజర్వులు ఈ క్రింది విధంగా వుండగలవు.

ప్రత్యక్షమైనవి: (అ) రైతాంగమూ, సర్వసాధారణంగా దేశ జనాభాలోని మధ్యతరగతి ప్రజలు. (ఆ) ఇరుగు పొరుగు దేశాలలోని కార్మికవర్గం (ఇ) వలసదేశాలలోని పరాధీన దేశాలలోని విప్లవోద్యమాలు (ఈ) శ్రామికవర్గ నియంతృత్వంయొక్క విజయాలు, సాధించిన ఘన కార్యాలు. (అయితే తనకన్న బలీయమగు శత్రువు తనపై పడకుండా వుండుటకై లంచమిచ్చి తప్పించుకొనుటకూ, వూపిరిపీల్చుకొనుటకై కొంత వ్యవధిని పొందుటకూ ఈ విజయాలలో కొన్నిటిని శ్రామికవర్గం తాత్కాలికంగా వదలుకొనవలసి వుంటుంది. అయితే అట్టి సందర్భంలోకూడా తనదే పైచేయిగా వుండునట్లు మాత్రం చూచుకొంటుంది) మరిన్ని.,

పరోక్షమైనవి: (అ) దేశంలో వుండే (శ్రామికవర్గం కాని) ఇతర వర్గాలలో వాటిలో వాటికి పరస్పర వైరుధ్యాలు, స్పర్థలు వుండగలవు. శత్రువును బలహీనపర్చుటకూ, తన రిజర్వులను బలపర్చుకొనుటకూ శ్రామికవర్గం ఈస్పర్థలను, వైరుధ్యాలను వుపయోగించుకొనగలదు.

(ఆ) శ్రామికవర్గ రాజ్యానికి విరోధమైన బూర్జువావర్గ రాజ్యాలలో వాటిలో వాటికి పరస్పరస్పర్థలు, వైరుధ్యాలు, పోరాటాలు, యుద్ధాలు (ఉదాహరణకు: సామ్రాజ్యవాద యుద్ధం) వుండగలవు. తాను దాడి జరుపునప్పుడుగాని, లేదా తప్పనిసరిగా తిరోగమించవలసిన సంద

ర్భంలో జరిపే సైన్య సంచాలనంలో (మెలకువగా తప్పుకొనుటలో) గాని శ్రామికవర్గం ఈ వైరుధ్యాలను, యుద్ధాలను వుపయోగించుకొనగలదు.

మొదటి తరహా రిజర్వుల ప్రాముఖ్యత గూర్చి అందరికీ తెలిసినదే కాబట్టి వాటిని గూర్చి విపులంగా చెప్పనక్కరలేదు. రెండవ తరహా రిజర్వులు విప్లవంయొక్క గమనంలో ఒక్కొక్కప్పుడు అత్యంత ప్రాధాన్యతను వహిస్తాయన్న విషయం సాధారణంగా స్పష్టంగా తెలియదు. మొదటి విప్లవ కాలంలోనూ, అటుపిమ్మట నూ, బూర్జువావర్గం పలుకుబడినుండి రైతాంగాన్ని తప్పించుటలో పెటీ బూర్జువా డెమోక్రాటుల (సోషలిస్టు-రివల్యూషనరీల) మధ్యనూ, లిబరల్-మొనార్కిస్టు బూర్జువాశక్తుల (కాన్‌స్టిట్యూషనల్ డెమోక్రాట్ల) మధ్యనూ వున్న విభేదాలు చాలా ప్రాముఖ్యతను వహించాయన్న విషయాన్ని ఎవ్వరూ కాదనలేరు. ఇదేవిధంగా అక్టోబరు విప్లవ కాలంలో సామ్రాజ్యవాదులలోనిముఠాలు తమలో తాము చావుబ్రతుకుల యుద్ధంలో మునిగియుండుట బ్రహ్మాండమగు ప్రాముఖ్యతను కల్గియున్నదన్న విషయాన్ని కూడా ఎవరూ కాదనలేదు. ఈ అంతర్యుద్ధంలో ఇవి పూర్తిగా నిమగ్నమై యుండుట వల్లనే అప్పుడే ఉదయించిన సోవియటు రాజ్యంపై తమ బలాలన్నిటినీ ఇవి కేంద్రీకరించలేక పోయినవి. సరిగ్గా ఈ కారణంవల్లనే, తన బలాలను నిర్మాణయుతం గావించుకొనుటకూ, తన శక్తి నంతటినీ కూడదీసుకొనుటకూ, కోల్చాక్, డెనికిన్‌లు ప్రారంభించిన విప్లవ ప్రతిఘాత తిరుగుబాటును అణచివేయుటకై తయారగుటకూ శ్రామికవర్గానికి అవకాశం చిక్కింది. ఇప్పుడో సామ్రాజ్యవాద ముఠాలలో పరస్పర విద్వేషాలు మరింత పెచ్చుమీరినవి: వారి మధ్య మరొక యుద్ధంతప్పని సరిగావచ్చే పరిస్థితులు వున్నవి; ఇట్టి ఈ దినాలలో కార్మికవర్గానికి ఈ తరహా రిజర్వుల సహాయంయొక్క ప్రాముఖ్యత ఎంత హెచ్చుగావున్నదో వూహించవచ్చును.

విప్లవం గమనంలో ఒకానొక దశలోని ప్రధాన లక్ష్యాన్ని జేసుటకై ఈ రిజర్వుల నన్నింటినీ సరిగా వినియోగించుకొనుటయే వ్యూహ నాయకత్వంయొక్క కర్తవ్యం.

రిజర్వులను సరిగా వినియోగించుకొనుటయంటే అర్థం ఏమిటి?

దీని అర్థం, కొన్ని అవుసరమగు షరతులను నెరవేర్చుటం. వాటిలో ఈ క్రింది వాటిని ప్రధానమైనవిగా ఎంచగలము.

ప్రథమం: విప్లవం అప్పటికే పూర్తిగా పరిపక్వంజెంది, దాడి మంచి జోరుగా సాగుచున్నప్పుడు, తిరుగుబాటు చేయ రావలసిరావటం నెత్తిమీదకు వచ్చి గూర్చున్నప్పుడు, రిజర్వులను అగ్రభాగానికి తెచ్చుటవల్లనే విజయం తథ్యము కాగల్గినప్పుడు. అటోయిటో తేలే ఇట్టి ప్రధానసమయమందు, శత్రువుయొక్క బలహీనస్థానమందు విప్లవంయొక్క ప్రధాన శక్తినంతటినీ కేంద్రీకరించాలి. రిజర్వుల నెట్లు వుపయోగించాలో 1917 ఏప్రిల్-అక్టోబరు మధ్యకాలంలో పార్టీ అవలంబించిన వ్యూహాన్నిచూస్తే తెలుస్తున్నది. నిస్సందేహంగా యుద్ధమే ఆ సమయంలో శత్రువుయొక్క అతిబలహీనస్థానం. ఈ విషయాన్నే మూలసమస్యగా తీసుకొనుటద్వారా, పార్టీ ప్రజలలో అత్యధికమగు భాగాన్ని శ్రామిక వర్గ విప్లవాగ్ర భాగమునకు (ప్రొలిటేరి

యన్ వాన్‌గార్డు) బాసటగా నిలబెట్టగల్గింది. ఈ విప్లవాగ్రభాగమును వీధులలో ప్రదర్శనములకు, పోరాటములకు తర్ఫీదుగావిస్తున్నప్పుడే, ఇందుకు తోడ్పాటుగా, యుద్ధరంగంలో సైనిక కమిటీలనూ, వెనుకతట్టున సోవియట్లనూ ఆర్గనైజ్ చేయుటద్వారా విప్లవాగ్రభాగం సరసకు రిజర్వులను తీసుకువచ్చింది. రిజర్వులు వుచితంగా వుపయోగింపబడినవని విప్లవం ఫలితాలే స్పష్టం జేసినవి.

తిరుగుబాటునుగూర్చి మార్క్సు, ఎంగిల్సులు ప్రతిపాదించిన సిద్ధాంతాన్ని నొక్కి చెప్పుతూ, లెనిన్, విప్లవశక్తులను నైపుణ్యంతో వుపయోగించుకోనవలసిన పరిస్థితులనుగూర్చి ఈ విధంగా చెప్పాడు:

“సాయుధ తిరుగుబాటుతో ఎన్నడూ చెరలాటలాడకు; కాని దానిని ప్రారంభించేటప్పుడు, కడవరకూ తీసుకొని పోవాలని స్పష్టంగా గుర్తించు. క్లిష్ట (అటోయిటో ఫలితాన్ని తేల్చే) దశలో, క్లిష్ట ప్రదేశంలో, నీవు అత్యధిక బలాన్ని సమకూర్చాలి లేదా ఎక్కువ సంసిద్ధత, ఎక్కువ నిర్మాణ బలముల అవకాశమును కల్గియున్న శత్రువు తిరుగుబాటుదార్లను నాశనం చేయగలడు. ఒకసారి తిరుగుబాటు ప్రారంభించిన పిమ్మట నీవు అత్యధికమగు పట్టుదలతో సంచరించాలి; ఏవిధంగానైనా సరే, తప్పనిసరిగా నీవే దాడిని ప్రారంభించు 'దెబ్బ కాచుకొనే స్థితి (ఆత్మరక్షణ) లో వుండటమే సాయుధ తిరుగుబాటుయొక్క మృత్యువు' నీవు శత్రువు ఏమరుపాటున వున్నప్పుడే వానిపై దాడి చేయాలి; వాని శక్తులు చెల్లాచెదరై వున్న సమయాన్ని చూసి మీదపడాలి ప్రతిరోజూ ఎంత స్వల్ప విజయమునైనా పొందుటకు (ఒకే పట్టణము విషయమైతే, ప్రతి గంటా అని చెప్పవచ్చును) నీవు కృషి జేయాలి. ఏ విధంగానైనా సరే 'నైతిక ఆధిక్యత'ను నిలబెట్టుకోవాలి.”

(లెనిన్, కలెక్టెడ్ వర్క్సు, సంపుటి II పేజీ 819-20)

ద్వితీయం : సంక్షోభం ఉచ్ఛదశకు జేరినప్పుడు, విప్లవ అగ్రగామి (వాన్‌గార్డు) కడవరకూ పోరాడుటకు సిద్ధంగా వున్నదని స్పష్టమైనప్పుడు, రిజర్వులు విప్లవాగ్రగామిని బలపర్చుటకు సిద్ధంగా వున్నప్పుడు, శత్రుశిబిరంలో అత్యధికమగు గంద్రగోళం వ్యాపించిఉన్నప్పుడు, సరిగ్గా ఈ సమయంలోనే చావుదెబ్బను (ఆఖరి దెబ్బ) కొట్టుటకూ, తిరుగుబాటును ప్రారంభించుటకూ అనువగు సమయాన్ని చూడాలి.

"మనకు వ్యతిరేకంగా వున్న వర్గశక్తులన్నీ చిక్కులలో పడివున్నప్పుడు, ఒకదానితో ఒకటి ఘర్షణ పడుచున్నప్పుడు; వాటిశక్తికిమించి జరిగే పోరాటంలో తగినంతగా అవి బలహీనపడినప్పుడు" "ఊగిసలాడే,స్థిరత్వంలేనివెన్నెముకలేని, మధ్యరకం శక్తులన్నీ - పెటీబూర్జువాజీ - పెటీబూర్జువాడెమో క్రాట్లు-ప్రజల ముందు తగినంతగా గుట్టుబెట్ట బెట్టుకొన్న పిమ్మట, తమ దివాళాకోరుతనంద్వారావారు తగినంతగా అవమానం పొందినపిమ్మట," "బూర్జువా వర్గానికి వ్యతిరేకంగా మిక్కిలి పట్టుదలతో, ధైర్యసాహసాలతో విప్లవ కార్యాచరణను సాగించాలనే తెగింపు శ్రామిక వర్గంలో ఉప్పెనవలె ఉధృతముగా పెరుగుచున్నప్పుడు" అట్టి సమయంలో అంతిమ పోరాటమునకు సమయం ఆసన్నమైనదని లెనిన్ తెలియజేసాడు అట్టి పరిస్థితిలోవిప్లవం నిజంగా పరిపక్వం చెంది వుంటుంది; పైన చెప్పబడిన పరిస్థితులన్నీ స్పష్టంగా గమనింపబడివుంటే, విజయం తథ్యం"

(లెనిన్ సెలెక్టడ్‌వర్క్సు,
సంపుటి 10 పేజి 137-38)

ఇటువంటి వ్యూహానికి ఒక నమూనా (మోడల్)గా అక్టోబరు విప్లవం సాగింపబడిన పద్ధతిని చూడవచ్చును.

ఈ పరిస్థితులను చూడకపోవటంవల్ల ఒక ప్రమాదకరమగు తప్పిదం చేయబడుతుంది; దీనినే "టెంపోను పోగొట్టటం" [బిగిని సడలించటం] అంటాము. పార్టీ ఉద్యమ స్థాయికి వెనుకబడ్డప్పుడు గాని లేదా ప్రజలను వదలి చాలా ముందుకు పోయినప్పుడుగాని ఇటువంటి ప్రమాదం సంభవిస్తుంది. "టెంపోను పోగొట్టుటకు" ఒక ఉదాహరణగా, తిరుగుబాటును ప్రారంభించుటకు ఎటువంటి సమయాన్ని ఎంచకూడదో చూపుటకు ఒక ఉదాహరణగా మనం ఒక విషయాన్ని చూడవచ్చును. 1917 సెప్టెంబరులో డెమోక్రాటిక్ కాన్ఫరెన్సు సభ్యులను అరెస్టు చేయటం మూలకంగా తిరుగుబాటును ప్రారంభించాలని మన కామ్రేడ్సులో ఒక భాగం ప్రయత్నించింది. ఆ సమయంలో సోవియట్లలో ఇంకా సంకోచం హెచ్చుగా వుంది; యుద్ధరంగంలో వున్న సైన్యాలు అటూ, యిటూ అని ఇంకా సంకోచిస్తూ వున్నవి; విప్లవాగ్రభాగానికి [వాన్‌గార్డు] బాసటగా ఇంకా రిజర్వులు సమాయత్తం గావింపబడలేదు. అట్టి సమయంలో తిరుగుబాటును ప్రారంభించటం ప్రమాదకరమని మనం ఉదాహరణగా చూడవచ్చును.

తృతీయం: ఎన్నికష్టాలు, ఎన్నిక్లిష్టతలు వచ్చినా, గమ్య స్థానమునకు పోవుటకై

వేసుకొన్నబాటనే దృఢనిశ్చయంతో సాగిపోవాలి. పోరాటంయొక్క గమ్యస్థానాన్ని విప్లవాగ్రభాగం (వాన్‌గార్డు) మర్చిపోకుండా వుండాలంటేనూ, ఆగమ్యస్థానాన్ని జేరుటకే ప్రయాణంచేస్తూ, విప్లవాగ్రభాగమునకు చుట్టూ జేరజాలచే ప్రజాసామాన్యం దారితప్పి పోకుండా చూడాలంటే; ఇది చాలా అవుసరం. దీనిని గుర్తించక పోవటం చాలాప్రమాదకరమగు తప్పిదానికి దారితీస్తుంది. దీనినే నావికులు 'దారి తప్పటం' అంటారు. ఈదారి తప్పటానికి ఉదాహరణగా మనం ఒక విషయాన్ని చూడవచ్చును. డెమోక్రాటిక్ కాన్ఫరెన్సు అయిపోగానే, ప్రీపార్లమెంటులో పాల్గొనాలనే తప్పుడు నిర్ణయాన్ని మన పార్టీ గావించింది. దేశాన్ని సోవియట్ల మార్గంనుండి బూర్జువా పార్లమెంటరీ మార్గానికి మళ్ళించజూచే బూర్జువా ప్రయత్నమే ఈప్రీపార్లమెంటు తతంగమనీ, ఇటువంటి సంస్థలో పార్టీ పాల్గొనటమంటేనానాగోత్రాలముతాలో కలవటమనీ,"అధికారమంతాసోవియట్లకే" అనే నినాదంతో విప్లవపోరాటాన్ని సాగిస్తున్న కార్మికులనూ, రైతులనూ గంద్రగోళపర్చుటయేననీ ఆసమయంలో పార్టీ మర్చిపోయింది. బోల్షివిక్కులు ఈప్రీపార్లమెంటునుండి బైటకువచ్చి వేయటంతో ఈతప్పు దిద్దుకోబడింది.

చతుర్థం : శత్రువు బలంగావున్నప్పుడు మన బలాలు వెనుకకు తగ్గుట (తిరోగమించుట) తప్పని సరియైనప్పుడు, మనను అసందర్భమైన సమయంలో శత్రువు మనలను పోరాటంలోనికి ఈడ్చినప్పుడు, అప్పటి బలాబలాలనుబట్టి, విప్లవాగ్రభాగానికి తగిలే దెబ్బను తట్టుకోవాలంటేనూ రిజర్వులను చెక్కుచెదరకుండా ఉంచాలంటేనూ, నష్టంలేకుండా తిరోగమించుటకై రిజర్వులను ఉపయోగించాలి.

"విప్లవ పార్టీలు తమవిప్లవ విజ్ఞానాన్ని సంపూర్ణం గావించుకోవాలి. దాడినిచేయుటే అవినేర్చుకొన్నవి. దీనికి తోడుగా, నష్టం లేకుండా, క్రమబద్ధంగా తిరోగమించుటను కూడా నేర్చుకొనుట ముఖ్యమని ఇవిఇప్పుడు గుర్తించాలి దాడిచేయుట, నైపుణ్యంతో తిరోగమించుట, ఈ రెండింటినీ క్షుణ్ణంగా నేర్చుకొననిదే విజయంపొందుట అసాధ్యం; ఈ విషయాన్ని విప్లవపార్టీలు తెలుసుకోవాలి– కఠినమగు అనుభవాలద్వారా ఈ సత్యాలను విప్లవవర్గం గుర్తించవలసి వస్తున్నది."

—లెనిన్ (సెలెక్టెడ్‌వర్క్సు, సంపుటి 10 పేజీ 65,66)

వ్యవధిని సంపాదించటం, శత్రువుమనోనిబ్బరాన్ని చెడగొట్టటం, తర్వాత దాడిని ప్రారంభించుటకై తన బలాలనుకూడ దీసుకోనటం – ఇవే ఈ వ్యూహంయొక్క లక్ష్యాలు.

ఈ వ్యూహానికి ఉదాహరణగా బ్రెస్టు లిటోవస్క్ సంధిని తీసుకోనవచ్చును. దీనివల్ల పార్టీకి కొంతవ్యవధి చిక్కింది. సామ్రాజ్యవాదుల శిబిరంలోవున్న తగాదాలను వినియోగించుకొనుటకు వీలు చిక్కింది. శత్రుబలాల మనోనిబ్బరాన్ని

చెడగొట్టుటకు వీలుచిక్కింది. కోల్చాకు డెనికిన్లపై దండయాత్ర ప్రారంభించుటకు బలాలను కూడదీసుకొనుటకై వ్యవధి చిక్కింది.

ఆకాలంలో లెనిన్ ఇట్లాచెప్పాడు: "మనం ప్రత్యేకంగా సంధి చేసికొనుట మూలకంగా కొన్ని లాభాలు కల్గినవి. రెండు సామ్రాజ్యవాద ముఠాలనుండి, ఇప్పటికాలంలో సాధ్యమైనంత హెచ్చుగా మనం తప్పుకొనుటకు వీలు కల్గింది. వారిలో వారికి వుండే వైరుధ్యాలు, జరిగే యుద్ధంవల్ల వారందరూ ఒక్కుమ్మడిగా మనపై పడుటకు అవకాశం లేకపోయింది. ఈఅవకాశాన్ని తీసుకొని మనం సోషలిస్టు విప్లవాన్ని మరికొంతముందుకు తీసుకొని పోవుటకూ, దృఢపర్చుటకూ అవకాశాన్ని సంపాదించాము."

(లెనిన్, కలెక్టడ్ వర్క్సు సంపుటి XXII పేజి 198)

"మనలను బలపర్చి, అంతర్జాతీయ సామ్రాజ్యవాదమును దెబ్బకొట్టిన రాజీగా ఎంతపెద్ద బుద్ధిహీనుడైనా, యిప్పుడు 'బ్రెస్టుసంధి'ని చూడగలడు," అని బ్రెస్టు లిటోవస్కు సంధి జరిగిన మూడుసంవత్సరముల పిమ్మట లెనిన్ అన్నాడు. సరియగు వ్యూహ నాయకత్వానికి వుండవలసిన ప్రధాన లక్షణాలు పైన పేర్కొనబడ్డవి.

# V

# ఎత్తుగడల నాయకత్వం

వ్యూహముయొక్క కర్తవ్యాలకూ, అవుసరాలకూ లోబడివుంటూ, అందలి భాగంగా ఎత్తుగడలువుండగలవు. శ్రామిక వర్గంయొక్క అన్ని పోరాటపద్ధతులనూ, నిర్మాణపద్ధతులనూ క్షుణ్ణంగా నేర్చుకొని వుండుటే; ఉన్న బలాబలాల సందర్భంలో వ్యూహవిజయమునకై అత్యధిక ఫలితాలను పొందునట్లుగా ఈ పద్ధతులను వుపయోగించుటను నేర్చుకొని వుండుటయే, ఎత్తుగడల నాయకత్వం కర్తవ్యం.

శ్రామికవర్గంయొక్క పోరాట పద్ధతులనూ, నిర్మాణపద్ధతులనూ సరిగావుపయోగించుట అంటే ఏమిటి?

అంటే కొన్ని ముఖ్యమగు షరతులను నెరవేర్చుట. వాటిలో ఈ క్రిందివి ముఖ్యమైనవి.

ప్రథమం: ఒకానొక సమయంలో, వుద్యమంయొక్క ఆటుపోటుల ననుసరించి, ఏ పోరాట పద్ధతులూ, నిర్మాణ పద్ధతులూ ఎక్కువ వుచితమో వాటిని ముందునకు తేవాలి. ఇందు మూలకంగా ప్రజాసామాన్యమును విప్లవ స్థానాలకు తెచ్చుట సులభమూ, నిశ్చితమూ అవుతుంది. లక్షలమందిని విప్లవరంగానికి కొనిరావటం, ఆవిప్లవరంగంలో వారిని సరియగు స్థానాలలో నిలబెట్టటం సులభం అవుతుంది.

పాతవ్యవస్థను నిలబెట్టటం ఇక అసాధ్యమనీ, దాని వినాశనం తప్పదనీ విప్లవాగ్రభాగం (వాన్‌గార్డు) గుర్తించటమే లేదు. ఇక్కడవున్న విషయం; ముఖ్య విషయమేమిటంటే, ప్రజాబాహుళ్యం,

లక్షలాది జనం, ఈవిధి విధాయకమును గుర్తించి, విప్లవాగ్రభాగమును బలపర్చుటకు సంసిద్ధతను వెలిబుచ్చటమే. కాని తన స్వానుభవంవల్లనే ప్రజాసామాన్యం ఇట్టి ఊత నిచ్చుటకు సంసిద్ధమౌతుంది. కాబట్టి, ప్రజాబాహుళ్యం తమ స్వానుభవంవల్లనే ఈ పాతవ్యవస్థ కూలిపోయే వ్రాతను గుర్తించుటకూ, తమ స్వానుభవంవల్లనే విప్లవ నినాదాల నిజాయితీని గుర్తించుటకూ వీలుగావుండునట్టి పోరాటపద్ధతులనూ, నిర్మాణపద్ధతులనూ రచించటమే ప్రధానకర్తవ్యం.

డ్యూమాయొక్క నిరుపయోగాన్నీ, కాన్స్టిట్యూషనల్ డెమోక్రాట్లవాగ్దానాలలోని బూటకత్వాన్నీ, జారు వ్యవస్థతో రాజీపడుటలోని అసాధ్యతనూ, రైతు, కార్మికవర్గముల కలయిక తప్పనిసరియనీ తమ స్వానుభవము వల్లనే సులభంగా ప్రజాసామాన్యం గుర్తించాలి. ఇట్లుచేయుటకుగాను పార్టీ ఆసమయంలో డ్యూమాలో ప్రవేశించుటకు తీర్మానించి యుండకపోతే, డ్యూమాలో పనిజేసే కర్తవ్యంపై తనబలాలను కేంద్రీకరించి యుండకపోతే, ఈ కృషినే తన పోరాటానికి ఆధారంగా చేసుకొని వుండకపోతే, విప్లవాగ్రభాగం (వాన్‌గార్డు) కార్మికవర్గంనుండి విడిపడిపోయి వుండేది; కార్మికవర్గం ప్రజాసామాన్యంతో సంబంధాన్ని కోల్పోయివుండేది. ఈ డ్యూమాకాలంలో గనుక ప్రజాసామాన్యం ఈ అనుభవాన్ని గడించి యుండకపోతే, కాన్స్టిట్యూషనల్ డెమోక్రాట్ల గుట్టును బట్టబయలు చేయటమూ, శ్రామికవర్గ నియంతృత్వాన్ని ఏర్పర్చటమూ సాధ్యమైవుండేవికావు.

"ఓడ్జోవిస్ట్, * ఎత్తుగడలను గనుక అవలంబించివుంటే ప్రమాదం ఏర్పడివుండేది. అందువల్ల విప్లవాగ్రభాగం (వాన్‌గార్డు) వారి రిజర్వులనుండి వేరుపడిపోయి వుండేది.

మెన్షివిక్కులు, సోషలిస్టు - రివల్యూషనరీలు యుద్ధోన్మాదులుగానూ, సామ్రాజ్యవాదులుగానూ ఇంకా పూర్తిగా బయలు పడకముందే; శాంతి, భూమి, స్వాతంత్ర్యములగూర్చి వీరు గావించే ఉపన్యాసములలోని బూటకత్వాన్ని ప్రజలు తమ స్వానుభవంవల్లనే ఇంకా తెలుసుకొననప్పుడే; అనగా 1917 ఏప్రిల్ నెలలోనే, తిరుగుబాటును ప్రారంభించాలని కొందరు అతివాద కమ్యూనిస్టులు పిలుపునిచ్చారు. శ్రామికవర్గమే గనుక వీరిని అనుసరించివుంటే, పార్టీ కార్మికవర్గానికి దూరమైపోయి వుండేది; రైతు, సైనిక ప్రజాసామాన్యంలో తనకున్న పలుకుబడిని కార్మికవర్గం కోల్పోయి వుండేది. కెరెన్స్కీ కాలంలో గనుక ప్రజలీ అనుభవాన్ని గడించి వుండకపోతే, మెన్షివిక్కులు, సోషలిస్టు - రివల్యూషనరీలు ప్రజలనుండి దూరంచేయబడి వుండేవారుకారు; శ్రామికవర్గ నియంతృత్వస్థాపన సాధ్యమైవుండేదికాదు. కాబట్టి పెటీబూర్జువా పార్టీల తప్పులగూర్చి, సోవియట్లలో బహిరంగంగా పోరాడ కోరే పంథాలోని తప్పులనుగూర్చి "ఓపికతో

* 1908 - 12 రియాక్షన్ కాలంలో, బోల్షివిక్కు పార్టీలో అవకాశవాద, పెటీబూర్జువా దృక్పథం వుండేది, స్టేట్‌డ్యూమానుండి సోషల్ - డెమోక్రాట్ ప్రతినిధులు రాజీనామా యివ్వాలనీ, ట్రేడ్‌యూనియన్లు వగైరా లీగల్ సంస్థలను నిల్పివేయాలనీ వీరి దృక్పథం. వీరినేమనం 'ఓడ్జోలిస్టులు' అంటాము.

బోధించటమే" అప్పటి సరియగు ఎత్తుగడలు.

శ్రామికవర్గ విప్లవమునకు నాయకత్వం వహించే పార్టీని ఏమీ ఆధారంలేని కొలదిమంది అసమర్ధులగు కుట్రదారుల ముఠాగా చేయుటయే అతివాద కమ్యూనిస్టుల ఎత్తుగడలలోని ప్రమాదం.

"విప్లవాగ్ర భాగంతోనే విప్లవాన్ని జయించటం అసాధ్యం. పూర్తి వర్గం అంతా, ప్రజాబాహుళ్యం అంతా, ఈ విప్లవాగ్రభాగానికి సూటిగా సహాయంజేసే ప్రయత్నంలో లేనప్పుడు, లేదా, కనీసం సానుభూతిగల తటస్థతనైనా వహించనప్పుడు, కిష్టపోరాటంలోనికి విప్లవాగ్ర భాగాన్ని దుమికించటం అంటే, అది పిచ్చితనమే కాదు, క్షమించరాని నేరం కూడా. వర్గంమొత్తం, శ్రామికజన బాహుళ్యంమొత్తం, పెట్టుబడి వల్ల పీడింపబడే ప్రజాసామాన్యం మొత్తం, అటువంటి ప్రయత్నంలో వుండాలంటే, కేవలం ప్రచారం, ఆందోళన మాత్రమేచాలవు. ఇందుకై ప్రజలు స్వానుభవమును పొందుట ఎంతో అవుసరం. ప్రతి మహావిప్లవంలోనూ కన్పించే ప్రాథమికసూత్రం ఇదే. ఈ సత్యం రష్యాలోనేగాక, జర్మనీలో కూడా ఎంతో స్పష్టంగా, ఖచ్చితంగా రుజువైనది. మిక్కిలి అజ్ఞానులు, అనాగరికులు అగు రష్యను ప్రజలేగాక, మిక్కిలి నాగరికులు, మిక్కిలి విద్యాసంపన్నులు అగు జర్మను ప్రజలుకూడా, పూర్తిగా కమ్యూనిజంవైపుకు మొగ్గుటకు ముందు కఠినమగు తమస్వానుభవంవల్లనే రెండవ ఇంటర్నేషనల్ వీరులనపుంసకత్వాన్ని, పిరికితనాన్ని, బూర్జువావర్గానికి చేసేదాసత్వాన్ని తెలుసుకొనవలసి వచ్చినది. శ్రామికవర్గ నియంతృత్వము కాకపోతే, అందుకు మారుగా అభివృద్ధినిరోధకాగ్రేసరుల నియంతృత్వం (రష్యాలో కార్నిలోన్, జర్మనీలో కాప్ కంపెనీ) ఒక్కటే సంభవించగలదని తెలుసుకొనవలసివచ్చినది." అని లెనిన్ తేల్చాడు.

[లెనిన్, సెలక్టడ్‌వర్క్సు, సంపుటి 10 పేజి 186]

ద్వితీయం: ఒకానొక కాలంలో పరిణామం గొలుసులో ఏలింకునైతే పట్టుకుంటే మొత్తంగొలుసునంతా స్వాధీనంలో

వుంచుకోనటం సాధ్యం అవుతుందో; వ్యూహ విజయమునకై తగు పరిస్థితులను కల్పించటం సాధ్యం అవుతుందో, ఆ లింకును కనిపెట్టటం అవసరం.

ఇక్కడ చూడవలసినదేమిటంటే, అనేక సమస్యలు ఎదుర్కొన్నప్పుడు, ఏ తక్షణ సమస్యయొక్క పరిష్కారంద్వారా ఇతర తక్షణసమస్యల పరిష్కారం సులభసాధ్య మౌతుందో ఆ సమస్యను ఇతర సమస్యల నుండి వేరుపర్చి, దానిపై కేంద్రీకరించటం.

ఈ థీసిస్‌ను బలపరుస్తూ రెండు వుదాహరణలను ఎత్తిచూపవచ్చును; ఒకటి పురాతనచరిత్రనుండి [పార్టీ ప్రాదుర్భావ కాలంనుండి], రెండవది, అధునాతన కాలంనుండి [నూతన ఆర్థిక విధానం కాలంనుండి.]

పార్టీని నిర్మించేకాలంలోవున్న స్థితి ఏమిటి? అసంఖ్యాకంగావున్న గ్రూపులు సంస్థలు ఇంకా అప్పటికి ఒకటిగా సంధింపబడలేదు. గ్రూపులకుండే స్థానిక దృక్పథం, నైపుణ్యారాహిత్యం పార్టీని నఖశిఖపర్యంతం ఆవహించి వున్నవి. పార్టీ ఆంతరంగిక జీవితంలో సిద్ధాంత గంద్రగోళం ప్రధానలక్షణమై వున్నది. ఇటువంటి సమయంలో పార్టీని ఎదుర్కొన్న కర్తవ్యతా పరంపరలోని ప్రధానకర్తవ్యం లింకుల గొలుసులోని ప్రధాన లింకు ఏమిటి? అఖిల రష్యను రహస్యపత్రికను స్థాపించటమే. ఎందుచేత? ఆనాడున్న పరిస్థితులలో, అసంఖ్యాకంగా వున్న గ్రూపులను, సంస్థలనూ అన్నిటినీ ఏకైక సంస్థగా నిర్మించుటకూ, సిద్ధాంతాలలోనూ ఎత్తుగడలలోనూ ఐక్యతను చేకూర్చుటకై అనువగు పరిస్థితులను కల్పించుటకూ; ఆ విధంగా నిజమగు పార్టీనినిర్మించుటకు, పునాదులను వేయుటకూ ఒక గట్టిపార్టీ బీజాన్ని నాటాలి. అఖిల రష్యన్ రహస్య పత్రికద్వారానే ఈ కర్తవ్యం సాధ్యపడగలదు.

యుద్ధమునుండి ఆర్థిక నిర్మాణానికి మారేదశలో వున్న స్థితి ఏమిటి? పరిశ్రమలు కూలబడివున్నవి; పారిశ్రామిక వస్తువులు అందక వ్యవసాయం కుంటుచున్నది. స్టేటు పరిశ్రమలకూ, వ్యవసాయార్థికానికీ ధృడబంధాన్ని ఏర్పర్చుట ద్వారానే సోషలిజమును జయప్రదంగా నిర్మించుటకు అవసరమగు ప్రధాన పరిస్థితులు కల్పించబడగలవు; ఇట్టి పరిస్థితులలో, వ్యాపారాన్ని వృద్ధి నొందించటమే పరిణామ క్రమంలోనికీలకమగులింకు; కర్తవ్యతా పరంపరలోని ప్రధాన కర్తవ్యం. ఎందుచేత? నూతన ఆర్థిక విధానం(నెప్)లో, వ్యాపారంద్వారా తప్ప ఇతర విధాల పరిశ్రమలకూ వ్యవసాయార్థికానికీ మధ్య బంధం ఏర్పర్చబడదు. నెప్ పరిస్థితులలో విడుదల (అమ్మకం) కాకుండా ఉత్పత్తిని గావించటం పరిశ్రమలకు వినాశ హేతువు. వృద్ధిఅయ్యే వ్యాపారం మూలకంగా అమ్మకం విస్తరించుటద్వారానే పరిశ్రమలు విస్తరించగలవు. పారిశ్రామిక రంగంలో మన స్థానాన్ని ధృడపర్చుకొన్నప్పుడే, వ్యాపారంపై మనం కంట్రోలును సంపాదించిన పిమ్మటనే, ఈలింకును మనం పట్టుకొన్న పిమ్మటనే పరిశ్రమలకూ వ్యవసాయ పంటల మార్కెటుకూ మనం లింకు ఏర్పర్చగల్గుతాము; ఇతర తక్షణ కర్తవ్యాలనుకూడా జయప్రదంగా నిర్వహించగల్గుతాము; అప్పుడే సోషలిస్టు ఆర్థిక విధానంయొక్క పునాదులను ఏర్పర్చే పరిస్థితులను కల్పించగలుతాము.

లెనిన్ యిలా చెప్పాడు.

"ఒక విప్లవవాదిగా వుండటంమాత్రమే జనరల్‌గా సోషలిజం, కమ్యూనిజముల అనుయాయిగ వుండటం మాత్రమే చాలదు. ఆయాపరిస్థితులలో ఏలింకునైతేపట్టుకుంటేమొత్తం గొలుసునంతా అదుపులో వుంచుకోవటం సాధ్యం అవుతుందో, రెండవ లింకును జేరుటకై ప్రాతిపదికను నిర్మించుట సాధ్యంఅవుతుందో, ఆలింకును వెదకుట కూడా ప్రతివారూ నేర్చుకొనివుండాలి".."ప్రస్తుత సమయంలో... సరియగు ప్రభుత్వ యాజమాన్యాన ఆంతరంగిక వ్యాపారమును పునస్థాపించుటయే ఈ లింకు. చారిత్రక సంఘటనల గొలుసులో 1921-22 రోజులలో, సోషలిస్టు నిర్మాణానికి పోవు దశలో వ్యాపారమే మనం శక్తికొలదీ గట్టిగా పట్టుకోవలసిన 'లింకు'"

—(లెనిన్ సెలెక్టెడ్ వర్క్సు, సంపుటి 9 పేజీ 298-299)

సరియగు ఎత్తుగడల నాయకత్వానికి ఈపై లక్షణాలు ప్రధానమైనవి.

# VI

## సంస్కరణతత్వము : విప్లవతత్వము

విప్లవతత్వ పూరితములగు ఎత్తుగడలకూ సంస్కరణతత్వ పూరితమగు ఎత్తుగడలకు వున్న తేడా ఏమిటి ?

సంస్కరణలకు, రాజీలకు జనరల్‌గా ఒడంబడికలకు లెనినిజం వ్యతిరేకమని కొందరను కొంటారు. ఇది శుద్ధపొరపాటు. ఒక అర్థంలో "ప్రతిస్వల్ప సహాయమూ" కొన్ని సందర్భాలలో జనరల్‌గా సంస్కరణలూ. ప్రత్యేకంగా రాజీలు, ఒడంబడికలూ, చాలా అవుసరమనీ, ఉపయోగకరమనీ ఇతరులకు తెలిసినంతగా బోల్షివిక్కులకూ తెలుసును.

"దేశాలమధ్య జరిగే భయంకర యుద్ధాలకన్న బూర్జువా వార్గానికి వ్యతిరేకంగా జరిగే యుద్ధం మరింత భీషణమైనదీ, దీర్ఘమైనదీ కష్టమైనదికూడ. ఇటువంటి పోరాటంలో, ముందుగానే సైన్య సంచాలనమును (తనబలాలను నైపుణ్యంతో నడపటం) నిరాకరించటం, శత్రుపక్షాలలో వున్న విభేధాలను (అవి తాత్కాలికమైనవైనా) వుపయోగించుకొనుటకు తిరస్కరించటం, తనకు మిత్రులుగా

వుండదగు వారలతో రాజీపడుటకు, ఒడంబడికలు కుదుర్చుకొనుటకూ (అవి తాత్కాలికమైనవైనా, అస్థిరమైనవైనా, మరితులతో కూడికొనినవైనా) నిరాకరించటం—ఇది శుద్ధ వెఱ్ఱితనం కాదా? ఇంతవరకూ, ఎవ్వరిచే పరిశోధింపబడనట్టి అగమ్యమగు పర్వతమునెక్కుటకుపూనుకొన్నప్పుడు, ముందుగానే, చుట్టుబాటల పోవుటకు నిరాకరించటం, ఎప్పుడూ వెనుకకు తిరిగి చూడనని భీష్మించటం, అసాధ్యమనితోచిన త్రోవనువదలి మరొకత్రోవను పోవుటకు నిరాకరించటం, ఇవీ పైనిరాకరణ పద్ధతీ, రెండూ ఒకటేకావా?" అని లెనిన్ చెప్పాడు.

—(లెనిన్ సెలెక్టెడ్ వర్క్స్, సంపుటి 10 పేజీ 111)

కాబట్టి ఇందువల్ల స్పష్టంగా తేలేదేమిటంటే, రాజీలు, ఒడంబడికలు అవుసరంగాక, వాటిని ప్రజలెట్లావుపయోగించుతారా అన్నదే ప్రశ్న.

సంస్కరణ వాదికి సంస్కరణలే సర్వస్వమూ; విప్లవ కార్యక్రమం సందర్భానుసారంగా అనుసరించేది మాత్రమే; ఊతపదం మాత్రమే; కళ్ళనీళ్ళు తుడుస్తానికివుపయోగపడే అడంబరపదంమాత్రమే. అందుచే బూర్జువాపరిపాలనలో, సంస్కరణతత్వ పూరితమగు ఎత్తుగడల ననుసరించుటవల్ల ఆ సంస్కరణలు చివరకు బూర్జువా పరిపాలనను బలపర్చుటకే, విప్లవాన్ని విచ్ఛిన్నం గావించే సాధనంగా మాత్రమే వుపయోగ పడగలవు.

విప్లవవాదికో, విప్లవ కృషియేగాని సంస్కరణ లెంతమాత్రం ప్రధానంకావు. ఆతనికి సంస్కరణలు విప్లవంయొక్క చిరుపంటలే (బై ప్రాడక్ట్స్)గాని ప్రధాన పంటలు కావు. అందుచేతనే బూర్జువా పరిపాలనలో విప్లవ పూరితములగు ఎత్తుగడలక్రింద సంస్కరణలు ఆ పరిపాలనను విచ్ఛిన్న మొనర్చుటకే సహాయపడగలవు; విప్లవాన్ని బలపర్చే సాధనాలుగాను, విప్లవోద్యమాన్ని మరింత ముందుకు తీసికొనిపోవుటకై పునాదిగాను వుపయోగ పడగలవు.

లీగల్ కార్యకలాపమును రహస్య కార్యకలాపముతో జోడించుటకూ; ఆ ముసుగుక్రింద బూర్జువావర్గాన్ని కూలత్రోయుటకై ప్రజల విప్లవ సన్నాహాలను సాగించే రహస్య కార్యకలాపాన్ని సాగించుటకు మాత్రమే విప్లవవాది సంస్కరణలను అంగీకరించగలడు.

సామ్రాజ్యవాద కాలంలో సంస్కరణలను, ఒడంబడికలను విప్లవధోరణిలో వుపయోగించటం అంటే ఇదే.

కాని ఇందుకు భిన్నంగా, మొత్తం రహస్య కార్యకలాపములను నిరాకరించుటూ, విప్లవమునకై ప్రజలు సాగించే సన్నాహాలకు అడ్డుతగులుటకూ, "ప్రసాదింపబడిన" సంస్కరణల నీడను విశ్రాంతి దీసికొనుటకూ మాత్రమే సంస్కరణవాదిసంస్కరణలను అంగీకరించగలడు.

సంస్కరణ తత్వపూరితములగు ఎత్తుగడలంటే ఇవే

సామ్రాజ్యవాదకాలంలో, సంస్కరణలకు, రాజీలకు, ఒడంబడికలకు వున్న స్థానం ఇంతమాత్రమే.

సామ్రాజ్యవాదం కూలద్రోయబడి, శ్రామికవర్గ నియంతృత్వం స్థాపించబడిన పిమ్మట, కొంతవరకూ ఈ పరిస్థితి మారుతుంది. ఒకానొక సమయంలో, కొన్ని సందర్భాలలో శ్రామికవర్గ ప్రభుత్వం, అప్పటివ్యవస్థను విప్లవపద్ధతులలో పునర్నిర్మించుటను తాత్కాలికంగా వదలవలసి వస్తుంది. విప్లవపద్ధతికి మారుగా, అంచెలంచెలుగా మార్పును తీసుకొని వచ్చేపద్ధతిలో; "బంగారంయొక్క ప్రాముఖ్యత" అన్న వ్యాసంలో లెనిన్ పేర్కొన్నట్లుగా, "సంస్కారపు బాట"లో; పక్కబాటలలో; శ్రామికవర్గంకాని ఇతర వర్గాలకు సంస్కరణలు, సదుపాయాలు కలిగించే బాటలలో; నడవవలసివస్తుంది. ఎందుకు? ఈ ఇతర వర్గాలను విచ్ఛిన్నంగావించుటకే; కొంత వూపిరిని పీల్చుకొనే వ్యవధిని విప్లవమునకు కల్గించుటకే; బలాన్ని కూడ దీసికొని నూతనదాడిని ప్రారంభించుటకే; యీ విధంగా చేయవలసి వుంటుంది. ఒక అర్థంలో ఇది సంస్కరణపు బాటయే; ఇందులో సందేహమేమీ లేదు. అయితే, ఈ విషయంలో ప్రధానమగు ఒక భేదాన్ని గుర్తించుకోవాలి. ఈ సంస్కరణలు శ్రామికవర్గ ప్రభుత్వంచే కల్పించబడుచున్నవి; యివి శ్రామికవర్గ ప్రభుత్వాన్నే బలపర్చగలవు; దానికి అవసరమగు విశ్రాంతిని సమకూర్చగలవు. వాటివుద్దేశ్యం విప్లవాన్ని విచ్ఛిన్నమొనర్చుటగాక, శ్రామిక వర్గేతరములగు వర్గాలను విచ్ఛిన్నమొనర్చుట మాత్రమే; ఈ భేదాన్ని మాత్రం ముఖ్యంగా గుర్తుంచుకోవాలి. ఇట్టి సందర్భాలలో, సంస్కరణాలు తద్వ్యతిరేకమగు స్వభావాన్ని పొందగలవు.

ఇంతకు ముందుకాలంలో విప్లవం అతి విస్తారమగు రంగంలో సాగుచుండుటవల్లనే యిట్టి పాలసీని అవలంబించుటకు శ్రామికవర్గమునకు అవకాశం కలుగుచున్నది; ఆ విస్తారమగు రంగంలో తిరోగమించుటకూ, దాడిచేసే ఎత్తుగడలకు బదులు తాత్కాలికంగా తిరోగమించే ఎత్తుగడల ననుసరించుటకూ, పక్కవాటు దెబ్బలనుకొట్టే ఎత్తుగడలను అనుసరించుటకూ' కావలసినంత చోటు వున్నది కాబట్టే శ్రామికవర్గమునకు యిట్టి వీలు కలుగుచున్నది.

కాబట్టి బూర్జువా పరిపాలనలో విప్లవముయొక్క చిరుపంటలుగా సంస్కరణలు వుద్భవిస్తే, ఇప్పుడో, శ్రామికవర్గ నియంతృత్వంక్రింద, శ్రామికవర్గ విప్లవ విజయములనుండే, శ్రామికవర్గంయొక్క బలసంపదలనుండే సంస్కరణలు వుద్భవించుచున్నవి.

"సంస్కరణలకూ విప్లవమునకూవున్న సంబంధాన్ని సరిగా నిర్వచించినది మార్క్సిజం ఒక్కటే. అయితే, ఒక్క దేశంలోనైనా శ్రామికవర్గం శాశ్వత విజయాన్ని పొందని కాలంలో అప్పటిదృష్టినుండే మార్పుకు ఈ సమస్యను వీక్షించాము. అటువంటి పరిస్థితులలో వాటి సరియగు సంబంధం ఏమిటి? శ్రామికవర్గ విప్లవ పోరాటంలో సంభ

వించు చిరుపంటలే (స్వల్పవిజయాలే) సంస్కరణలు...ఏ ఒక్క దేశంలోనైనాసరే, విప్లవం జయించిన పిమ్మట, సంస్కరణలకూ విప్లవానికీ మధ్యవున్న సంబంధాలలో నూతన పరిస్థితి ఏర్పడుతుంది. సిద్ధాంతరీత్యా చూస్తే ఈ సంబంధం ఇదివరకువున్న సంబంధమే; కాని ఇందులో ఒకమార్పు మాత్రం కల్గుతుంది. మార్క్సు దీనిని ముందుగానే కనుగొనటం సాధ్యంకాదు. కానిమార్క్సిస్టు సిద్ధాంతాలు, రాజకీయాలననురించి మనం దీనిని గుర్తించక తప్పదు...... విప్లవం జయంపొందిన దేశం అధికమగుశక్తినివెచ్చించివుంటుంది. కాబట్టి విజయం పొందిన పిమ్మట, ఆ ఈ మార్పులను సాధించుటకు తగినంత శక్తి లేనిసమయంలో,సంస్కరణలు అవుసరమగు, తప్పనిసరియగు విశ్రాంతిగా వుపయోగపడగలవు (అయితే, అంతర్జాతీయ రంగంలోని 'చిరుపంటలు' స్వభావాన్నేకల్గి వుండగలవు.) అయితే, ఈవిధంగా తప్పనిసరిగా తిరోగమించవలసి వచ్చినా, అట్టి సమయంలో శారీకంగానూ, నైతికంగాను, దృఢంగా నిలబడివుండుటకై కావలసిన "రిజర్వుశక్తి" విజయం సమకూర్చుచున్నది." అని లెనిన్ తెలియజేశాడు.

—(లెనిన్ సెలక్టడ్ వర్క్సు, సంపుటి 10 పేజీ 301-02)

"గనులలో ముడిపదార్థంలోనుంచి మంచి లోహాన్ని తీసినట్లుగా ప్రజాజీవితంనుంచి ఉత్తమసారస్వతం కళలు రాబట్టవచ్చు. ప్రాథమికదశలో అవి ప్రాచీనంగాను, మోటుగాను వున్నప్పటికీ కొల్లలుగా ప్రజాజీవితంలో మనకవి లభిస్తాయి. ఇక్కడ మరొక అంతులేనిగని వున్నదన్నమాట. ఆ గనిలోనుంచి మనం ఎంతైనా త్రవ్వి తీసుకోవచ్చు. అది అక్షయం."

మావ్ - సి - టుంగ్

(కళలూ - సారస్వతం ఎవరికోసం పేజీ 21)

# సో. యూ. క. పార్టీ నిర్మాణసూత్రాలు

జి. బ్రోవరీగ్స్

## I

## కార్మికవర్గపార్టీని గురించి లెనిన్, స్టాలిన్‌ల ఉపదేశాలు

కార్మికవర్గపార్టీ ఆశయాలూ, దాని నిర్మాణసూత్రాలూ, మార్క్సిస్టు - లెనినిస్టు సిద్ధాంతంలో ఒక అత్యంత ముఖ్యమైన భాగమై ఉన్నాయి. లెనిన్, స్టాలిన్‌ల ఉపదేశాల ప్రకారం తీవ్రమైన, విప్లవకరమైన, ధైర్యంగల కార్మికవర్గపార్టీ మాత్రమే - అవకాశవాదానికి ఎడమివ్వని పార్టీ మాత్రమే - కమ్యూనిజం విజయంకోసం జరిగే పోరాటంలో సరియైన రాజకీయవిధానాన్ని నిర్ణయించే శక్తి గలిగిన పార్టీ మాత్రమే - శ్రామికప్రజలు అధికారాన్ని స్వాధీనం చేసుకొనేందుకు జరిగే పోరాటంలో ప్రజానీకాన్ని జయప్రదంగా నడుపగలుగుతుంది; వారిని సంఘటిత పరచగలుగుతుంది.

శాస్త్రీయసోషలిజానికి మూలపురుషులైన మార్క్సు, ఎంగిల్సులు కార్మికవర్గానికి పార్టీ అగ్రగామిదళమనే సిద్ధాంతానికి ప్రధాన ఆకృతిని కల్పించారు. పార్టీలేనిదే శ్రామికవర్గం తన బానిసత్వాన్నుండి విముక్తిని పొందలేదని, పార్టీలేకుండా అది అధికారాన్ని హస్తగతం చేసుకోవడంగానీ, పెట్టుబడిదారీ విధానం స్థానంలో ఒక నూతనసమాజాన్ని సోషలిస్టుసూత్రాలపై ఆధారపడిన సమాజాన్ని నిర్మించడంగానీ సాధ్యపడదని మార్క్సు, ఎంగిల్సులు తెలియజేశారు.

మార్క్సు, ఎంగిల్సుల మరణానంతరం మార్క్సిస్టు సిద్ధాంతంలో అంతర్భాగమైన యీ సూత్రాలకు రెండో అంతర్జాతీయ సంస్థకు

చెందిన పార్టీలను ఆక్రమించు కొన్ని అవకాశవాదులచే వక్ర భాష్యాలు కల్పించబడ్డాయి.

దాదాపు శాంతియుత అభివృద్ధిదశలో - పార్లమెంటరీ పోరాటాలనే ప్రధానపోరాట రంగాలుగా గుర్తించబడుతున్న కాలంలో పాత సోషల్ డెమోక్రటిక్ పార్టీలు తమకార్యకలాపాలను కొనసాగించినాయి. వర్గాల మధ్య బహిరంగ సంఘర్షణలు ఉదయించిన దశలో - సామ్రాజ్యవాద యుగంలో నూతన పరిస్థితులను దృష్టిలో వుంచుకొని కార్మిక వర్గపోరాటాలను నడపడానికి వారు అసమర్థులని రుజువైంది. సామ్రాజ్యవాదాన్ని కూలద్రోయడానికి శక్తులన్నీ సమకూర్చబడి, కార్మికవర్గం అధికారాన్ని హస్తగతం చేసుకోడానికి పరిస్థితులు పరిపక్వమైన పరిస్థితులలో పోరాటాలను నడపడానికి సోషల్ డెమోక్రటిక్ పార్టీలు పనికిరావని దృఢపడింది. ఈ దశను గురించి కామ్రేడ్ స్టాలిన్ యిలాఅన్నాడు: యీ వత్తు పార్టీ కార్యకలాపాలనూ నూతన విప్లవపద్ధతుల పైన పునర్నిర్మాణం చేయవలసిన ఆవశ్యకతనూ, అధికారాన్ని హస్తగతం చేసుకొనే విప్లవ పోరాట దృక్పథంలో వర్కర్లను తర్ఫీదు (ఎడ్యుకేట్) చేయవలసిన ఆవశ్యకతనూ, రిజర్వ్‌దళాలను తయారుచేసుకోవడం వీటిని కదిలేటట్లు చేయవలసిన అవసరాన్ని, ఇరుగు పొరుగు దేశాలలోని శ్రామికులతో సన్నిహిత సంబంధాను బలపరచుకోవలసిన అగత్యాన్ని, వలసదేశాలలోనూ, పరాధీన దేశాలలోనూ వున్న జాతీయ విముక్తి ఉద్యమాలతో దృఢమైన సంబంధాలను ఏర్పరచుకోవలసిన ఆవశ్యకతనూ మన ప్రధాన బాధ్యతలుగా ఈదశముందుకు నివచ్చింది. అవకాశవాద బురదలో కూరుకొనిపోయిన పెట్టుబడిదారీ విధానానికి సంరక్షకుల స్థితికి దిగజారిపోయిన పాత పార్టీలు యీ నూతన బాధ్యతలను నెరవేర్చవు; నెరవేర్చలేవుకూడా.

కామ్రేడ్ స్టాలిన్ యీ సందర్భంలో యిలా రాశాడు.

"అలాంటి బాధ్యతలను తన నెత్తిపైనుంచుకొని శ్రామికవర్గం యింకా పాత పార్టీల నాయకత్వం క్రిందనే వుంటే అది సంపూర్తిగా నిరాయుధం అవుతుంది......

"అందువలననే ఒక నూతన పార్టీ, ఒక తీవ్రమైనపార్టీ, ఒక విప్లవపార్టీ

అధికారాన్ని హస్తగతం చేసుకొనేం దుకు జరిగే పోరాటంలో శ్రామికు లను ధైర్యంగా నడుపగలిగేపార్టీ - విపరీతమైన చిక్కులతో నిండిన విప్లవ పరిస్థితిలో సహితం తన మార్గాన్ని తెలుసుకోడానికి తగినంత అనుభవం గలిగిన పార్టీ - తన ఆశయ సిద్ధికి చేరు కొనే మార్గమధ్యలోని అవాంతరాల నుండితననావను ఎలాంటిప్రమాదాలకు గురిగాకుండా జాగ్రత్తగా నడిపించ డానికి తగిన శక్తి సామర్థ్యాలూ, నిపుణత్వాన్ని గలిగిన పార్టీ యొక్క అవసరం ఉంది."

—ప్రోబ్లమ్స్ ఆఫ్ లెనినిజం పేజీ 72-73

సరిగ్గా యీ రకమైన నూతన పార్టీనే లెనిన్ స్టాలిన్‌లు నిర్మించి నడిపారు.

శ్రామికవర్గపార్టీకి సంబంధించి మార్క్సు, ఎంగిల్సులు యిచ్చిన విధానాన్ని పునాదిగా చేసుకొని లెనిన్ స్టాలిన్‌లు ఒక "పోరాట పార్టీగా" కార్మికవర్గపార్టీ నిర్మా ణములోని అంతర్గత సిద్ధాంతాన్ని అభివృద్ధిపరచారు. కార్మికవర్గాన్ని శ్రామికవర్గ నియంతృత్వ స్థాప నకూ, సోషలిజం విజయానికి జరిగే పోరాటంలో నడపడమే యీ పార్టీయొక్క ధ్యేయం.

సోవియట్ యూనియన్ కమ్యూనిస్టుపార్టీ చరిత్రలో (51 వ పేజీ) స్టాలిన్ ఉదహరించినట్లు,

"మార్క్సిజం చరిత్రలో మొట్ట మొదటిసారిగా లెనిన్ శ్రామికవర్గా నికి నాయకత్వసంస్థగానూ, శ్రామిక వర్గ ప్రధాన ఆయుధంగానూ, పార్టీ యొక్క నిర్మాణ సిద్ధాంతాన్ని అభి వృద్ధి పరచాడు. అలాంటి పార్టీ నిర్మాణ సిద్ధాంతం లేకుండా శ్రామిక వర్గ నియంతృత్వంకోసం జరిగే పోరా టము విజయప్రదం కాజాలదు."

"ఒకడుగు ముందుకూ రెండడు గులూ వెనక్కీ" అనే తన ప్ర ఖ్యాత గ్రంథంలో లెనిన్ ఒకకొత్త రకపు పార్టీగా మార్క్సిస్టు పార్టీ యొక్క నిర్మాణసూత్రాలను స్పష్ట ంగావివరించాడు. లెనిన్‌కుఅత్యంత సన్నిహిత కామ్రేడుగా పనిచేసి, యిప్పటికీ ఆయన మహత్కా ర్యాన్ని కొనసాగించుతున్న జోసెఫ్ స్టాలిన్ పార్టీ నిర్మాణాన్ని గురించి లెనిన్ సూత్రాలను యింకా అభివృద్ధి చేశాడు. రాజ కీయ విధానానికీ నిర్మాణకృషికీ మధ్యనున్న పరస్పర సంబంధా లను గురించిన సిద్ధాంతజ్ఞానం తోనూ, కేడరును శాస్త్రీయ దృక్పథంతో ఎన్నిక చేయడం వారికి అవసరమైన తర్ఫీదునివ్వడం వారి వారి శక్తిసామర్థ్యాలనుబట్టి వివిధ స్థానాలకు కేడరును పంచ డం,నిర్ణయాలుఅమలుజరుగుతున్న విధానాన్ని గురించి నిర్మాణ

రీత్యా తణిఖీచేయడం పార్టీలోకి ఏదో ఒక విధంగా జొరబడే శత్రువులను గురించి బోల్షివిక్‌జాగ్రత్త తీసుకొంటూ శత్రువులతో పోరాడేపద్ధతులను తెల్సుకోవడం, పార్టీ సభ్యులలో ఊనక్కిలాగే వారిని, రెండువిధాలుగా సంచరించేవారిని తొలగించిపార్టీని శుద్ధిచేసే విధానాన్ని బోల్షివిజాన్ని సంపూర్తిగా అవగాహం చేసుకొనే విధానాన్ని – మొదలుగాగలవాటన్నింటిన్నీ పార్టీకి లభింపజేసి పార్టీ నిర్మాణాన్ని స్టాలిన్ మరింత దిట్టపరచాడు.

మహా సిద్ధాంత వేత్తలూ, కమ్యూనిజం నాయకులూ అయిన లెనిన్ స్టాలిన్‌లు అవకాశవాదుల యెడ బద్ధశత్రువుగానూ బూర్జువాజీ వ్యతిరేకంగా విప్లవ ప్రపూరితమైనటువంటి దృఢమైన కట్టుదిట్టంగల ఏకీకృతమైన పోరాట సంస్థగా నిజమైనమార్క్సిస్టుపార్టీని నిర్మించారు. ఆర్థిక వాదులకూ, మెన్షివిక్‌లకూ, ట్రాట్స్కీయిస్టులకూ బుఖారిన్ వాదులకూ, తత్వశాస్త్రంలో అన్ని రకాలకుచెందిన భావవాదులకూ, వ్యతిరేకంగా జరిపిన పోరాటంలో కాకలుతీరి, నిగ్గుతేలి బోల్షివిక్‌పార్టీ నిర్మించబడింది. ఒక కొత్తరకం పార్టీకి పునాదివేసిన ప్రత్యేక సిద్ధాంతం, వ్యూహం, ఎత్తుగడలు, నిర్మాణ విధానం దానికున్నాయి. నిజమైన విప్లవకర మార్క్సిస్టుపార్టీ లన్నింటికీ బోల్షివిక్‌పార్టీ ఉత్తమోత్తమమైన ఆదర్శం.

కొత్తరకం పార్టీ నిర్మాణానికి పునాదిని తయారు చేయడంలో 'ఏమిచేయాలి?' 'ఒకడుగుముందుకు రెండడుగులు వెనక్కు,' "ప్రజాతంత్ర విప్లవంలో సోషల్ డెమాక్రసీ యొక్క రెండెత్తుగడలు," "మెటీరియలిజం అండ్ ఎంపిరియో క్రిటిసిజం," లాంటి లెనిన్ ప్రఖ్యాత గ్రంథాలూ, "పార్టీలోని అభిప్రాయ బేధాలను గురించి క్లుప్తంలో" "ఒక సోషల్ డెమాక్రట్టుకు జవాబు" "శ్రామిక వర్గమూ శ్రామిక వర్గ పార్టీ" "అరాచకంలేక సోషలిజం" లాంటి స్టాలిన్ ముఖ్య రచనలూ ప్రధానమైన నిర్ణాయక పాత్రను వహించాయి.

తన అర్థశతాబ్దపు విప్లవ పోరాట కాలంలోనూ లెనిన్ స్టాలిన్‌లపార్టీ ప్రపంచమంతటిలో అన్నింటికంటే విప్లవకర పార్టీ

గానూ, బలవత్తర పార్టీగానూ, స్పష్టంగా రుజువైంది,

ఇంతవరకూ సోవియట్ యూనియన్‌లోని ప్రజలు సాధించిన విజయాలకు మూలకారణం సోవియట్ యూనియన్ కమ్యూనిస్టుపార్టీ నాయకత్వమే. కమ్యూనిస్టుపార్టీ కార్మికవర్గాన్నీ రైతాంగాన్నీ మేధావులను సంయుక్తంగా సంఘటిత పరచింది.

కమ్యూనిస్టుపార్టీ నాయకత్వం అధ్వర్యాన శ్రామిక ప్రజలు తమ సోవియట్ ప్రభుత్వాన్ని నిర్మించుకొని వైట్‌గార్డుల, విదేశ దురాక్రమణదారుల దాడులనుండి రక్షించుకొన్నారు.

పార్టీ అనుసరించిన సరియైన పంథా ఇదివరకు వెనుకబడివున్న జారిస్టురష్యాను ఎంతో అభివృద్ధి చెందిన బలవత్తరమైన సోషలిస్టు రాజ్యంగా మార్చివైచింది. ఈ సోషలిస్టు రాజ్యం హిట్లర్ జర్మనీకీ సామ్రాజ్యవాద జపాన్‌కు వ్యతిరేకంగా దేశభక్తియుతమైన యుద్ధంలో అనేక భయంకర ప్రమాదాలను తట్టుకొని నిలబడగలగడమేగాక మరింత బలవత్తర రాజ్యంగానూ, పరీక్షలలో నిగ్గు తేలిన శక్తిగాను యుద్ధాన్నుండే బయటపడింది.

లెనిన్ స్టాలిన్‌ల పార్టీ నాయకత్వాన సోవియట్ ప్రజలు ఇప్పుడు - యుద్ధానంతరం తమ జాతీయ ఆర్థికవిధానం నూతనంగా బ్రహ్మాండంగా పురోగమించడానికి జయప్రదంగా కార్యక్రమాన్ని కొనసాగించుతున్నారు.

కమ్యూనిస్టుపార్టీ యింతటి అభేద్యమైన బలాన్ని సంపాదించడానికి కారణమేమంటే దానిచేతలకూ దాని మాటలకు భేధంలేకపోవడమే. దాని ఆచరణకు అది చెప్పే సిద్ధాంతానికి తారతమ్యం లేకపోవడమే, తన పోరాట ఆశయాలను ముందుకు తీసుకొనివెళ్ళడానికి సరియైనపంథాను నిర్ణయించుకోడానికి కావలసిన శక్తిసామర్థ్యాలు పార్టీకున్నాయి. అంతేకాదు. ఆచరణలో యీ ఆశయాలను సాధించడానికి అవసరమైన పోరాటాన్ని సాగించడానికి అవసరమైన నైపుణ్యాతను పార్టీ కలిగిఉంది. లెనిన్ స్టాలిన్‌లు తమ మహత్తరమైన రచనలలో అభివృద్ధిపరచి వివరించిన (పార్టీ) నిర్మాణసూత్రాలు రష్యాలో జరిగిన మూడు విప్లవాల అగ్ని

పరీక్షకు నిలబడగలిగినాయి. ఆ నిర్మాణసూత్రాలయొక్క పటుత్వం ఆ తరువాత సోవియట్ రష్యాలో సోషలిస్టు సమాజనిర్మాణానికి జరిగిన కార్యక్రమంలోనూ యుద్ధకాలంలో పార్టీనిర్వహించిన బ్రహ్మాండమైన నిర్మాణ కృషిలోనూ, నేడు - యుద్ధానంతర కాలంలో దేశపునర్నిర్మాణానికీ, సోవియట్ యూనియన్ జాతీయ ఆర్థికాభివృద్ధికీ నిర్ణయించిన పంచవర్ష ప్రణాళికను జయప్రదంగా ముగించడానికి జరుగుతున్న ప్రయత్నాలలోనూ ధృవపడింది.

లెనిన్ స్టాలిన్‌లు కార్మికవర్గ పార్టీ సిద్ధాంతాన్ని శ్రామికవర్గ నాయకత్వసంస్థగానూ, అత్యున్నత వర్గ నిర్మాణ స్వరూపంగల సంస్థగానూ, కార్మికవర్గానికి అత్యంత ముఖ్యమైన ఆయుధంగానూ అభివృద్ధి పరచారు.

అయితే; కమ్యూనిస్టుపార్టీ నిర్మాణసూత్రాలేమిటి?

లెనిన్ స్టాలిన్‌ల ఉపదేశాల ననుసరించి కమ్యూనిస్టుపార్టీ విప్లవ సిద్ధాంతం గలిగిన కార్మికవర్గ అగ్రగామిదళం, కార్మికవర్గంలోని చైతన్యం గలిగిన సైనికదళం.

అంతేకాదు; కమ్యూనిస్టుపార్టీ కార్మికవర్గంయొక్క అగ్రగామి దళమేగాక కార్మికవర్గం యొక్క నిర్మాణయుక్తమైన సైనికదళము కూడా. ఈ సైనికదళం ముతాలకు, ద్వంద్వవిధానాలకు తావునివ్వకుండా, పార్టీ కార్యక్రమానికి నిబంధనలకూ, పార్టీ క్రమశిక్షణకు ఎలాంటి భంగము వాటిల్లడాన్ని సహించని, ఆశయ ఆచరణలలో ఐక్యత గలిగిన సుసంఘటిత సంస్థగా వుంటుంది.

అంతేకాక పార్టీ కార్మికవర్గం యొక్క అత్యున్నతవర్గ నిర్మాణ స్వరూపం, కార్మికవర్గానికి చెందిన యితర అన్ని సంస్థలకు సలహానిచ్చి నడపడమే దాని ధ్యేయం.

కోటానుకోట్ల కార్మికవర్గానికి కార్మికవర్గ అగ్రగామిదళానికి సన్నిహితసంబంధం యొక్క ప్రతిబింబమే పార్టీ.

తనపైనున్న బాధ్యతలను నెరవేర్చేందుకు ఒకేవిధమైన నిబంధనలతోనూ, సభ్యులందరికీ సమానంగా వర్తించే ఒకే ఒక పార్టీ క్రమశిక్షణవిధానంతో కూడిన కేంద్రీకృత ప్రజాస్వామిక సూత్రాలపై నిర్మించబడుతుంది. పార్టీ

అంతటికీ నాయకత్వం వహించి, వఘుపగల ఒకే ఒక కేంద్రసంస్థ ఉంటుంది. మైనారిటీ మెజారిటీని అనుసరించాలి. వ్యక్తిగతసంస్థలూ కేంద్రానికీ, క్రిందిసంస్థలు పైసంస్థలకూ లొంగి పనిచేయాలి.

అన్నిటికంటే చివరి నిర్మాణ సూత్రమేమంటే : సభ్యులందరి పైనా సమానంగా వర్తించే ఒకే ఒక రకమైన, చైతన్యపూరితమైన శ్రామికవర్గపు క్రమశిక్షణను ఆచరణలో తానమలుజరిపే కార్యకలాపాలన్నిటిలోనూ పార్టీ ఖచ్చితంగా అమలు జరపాలి.

# II

## కమ్యూనిస్టుపార్టీ కార్మికవర్గం యొక్క అగ్రగామి సైనికదళం

కొత్తరకపు పార్టీయైన కమ్యూనిస్టుపార్టీయొక్క ప్రధాన నిర్మాణ స్వభావమేమంటే అది కార్మికవర్గంయొక్క అగ్రగామి సైనికదళం. కార్మికవర్గానికి అనేక సైనికదళాలుంటాయి. ప్రతి ఒక్క సైనికదళం అగ్రగామి అని పిలువబడదు. శ్రామికవర్గ పార్టీకీ కార్మికవర్గానికి చెందిన యితర సైనికదళాలకూ భేదముంది. శ్రామికవర్గ పార్టీ మామూలు సైనికదళంకాదు. అది సమాజ జీవిత రీతులకూ, దాని అభివృద్ధి సూత్రాలకూ, వర్గ పోరాట సూత్రాలకూ సంబంధించిన జ్ఞానాన్ని కలిగి వర్గచైతన్యం కలిగిన కార్మిక వర్గ అగ్రగామిదళం; మార్క్సిస్టు సైనికదళం.

పార్టీ కార్మికవర్గం మొత్తమూ ఒకటేనని భావించరాదనే విషయాన్ని సోవియట్ యూనియన్ కమ్యూనిస్టుపార్టీ చరిత్ర మనకు బోధించింది. ఆకాలంలో రష్యన్ మెన్షివిక్‌లు కోరినట్లుగా ప్రతి సమ్మెదారుడూ పార్టీ సభ్యుడుగా వుండతగునసే వాదన సరికాదు. పార్టీనీ, వర్గాన్నీ, ఒకేవిధంగా పరిగణించేవాడల్లా పార్టీ చైతన్యస్థాయిని ప్రతి సమ్మెదారుని చైతన్యస్థాయికి దిగజార్చి వేస్తున్నాడని తెలుసుకోవాలి. అలాంటివారు వర్గచైతన్యంతోకూడిన కార్మిక వర్గ అగ్రగామిదళంగా పార్టీని నాశనం చేస్తున్నారన్నమాట."

—సో. యూ. క. పార్టీ చరిత్ర పేజీ 46

కార్మిక వర్గానికి అగ్రగామి దళంగానూ, ప్రజలకు నిజమైన నాయకుడుగాను వుండటానికి కమ్యూనిస్టుపార్టీ కార్మికవర్గం యొక్క-యావత్తుచారిత్రికపంథాను తెలుసుకొని నడుపగలిగి వుండాలి. మార్గ మధ్యలో ప్రతిఒక్క సమయంలోనూ ఏవో ప్రత్యేక కార్మిక సంస్థల ప్రయోజనాలనుగాక యావత్తు కార్మికవర్గంయొక్క ప్రయోజనాలను కాపాడ గలిగి వుండాలి.

కమ్యూనిస్టుపార్టీ తన కార్యాచరణలో ఎల్లప్పుడూ మార్క్సు ఎంగిల్సు, లెనిన్, స్టాలిన్‌ల సిద్ధాంతాన్ననుసరించే నడుస్తుందిగాబట్టి అది నాయకత్వ పాత్రను నిర్వహించుతుంది.

స్టాలిన్ యిలా చెపుతాడు;

"అది నిజమైన అగ్రగామిగా వుండగలందులకు పార్టీ విప్లవ సిద్ధాంతాన్నీ, ఉద్యమ సూత్రాల జ్ఞానాన్నీ, విప్లవ సూత్రాల జ్ఞానాన్నీ కలిగివుండాలి." (ప్రోబ్లమ్స్ ఆఫ్ లెః నిజం.) అలా వుండక పోయిన పక్షంలో పార్టీ ఆకస్మికంగా తమంతటతాముగావచ్చే ఉద్యమాలకు తోకగా తయారై బూర్జువా పాలసీకి ప్రతినిధి అయ్యే పరిస్థితికి దిగజారే అవకాశముంటుంది.

రెండో అంతర్జాతీయ సంస్థకు చెందిన పార్టీలు శ్రామిక వర్గ పోరాటాలను తోకగా అనుసరించి మార్క్సిజంలోని అసలు విప్లవ సారాన్ని వదిలివేశాయిగాబట్టే, అవి సామ్రాజ్యవాదానికి గులాములై, కార్మికవర్గంలో బూర్జువా పలుకుబడికి ఆధారభూతమైనాయి.

యుగోస్లేవియాలోని టిటో ముఠా విదేశ, దేశీయ వ్యవహారాలకు సంబంధించిన అన్ని ప్రధాన సమస్యలలోనూ మార్క్సిజం - లెనినిజాన్ని విడిచి పెట్టింది. గాబట్టే అది సామ్రాజ్యవాద వ్యతిరేక సంయుక్త సోషలిస్టు సంఘటననుండి విడిపోయి, శ్రామికప్రజల అంతర్జాతీయ సంఘటన ఆశయానికి ద్రోహం చేసి జాతీయవాద పంథాను చేబట్టింది.

కమ్యూనిస్టుపార్టీ విప్లవ మార్క్సిస్టు సిద్ధాంతాన్ని ఖచ్చితంగా అనుసరించితేనే మార్క్సు, ఎంగిల్సు లెనిన్, స్టాలిన్‌ల మహత్తర పతాకానికి బద్ధులై వుంటేనే అది కార్మికవర్గ అగ్రగామి పాత్రనూ, ప్రజలకు రాజ

కీయ నాయకత్వ పాత్రనూ నిజంగా నిర్వహించ గలుగుతుంది సోవియట్ యూనియన్ కమ్యూనిస్టుపార్టీ యీ విజయపతాకం క్రింద దృఢంగా పోరాడుతూ ఎడ తెగని కృషి సల్పుతుంది. అందు కనే అది కమ్యూనిజానికే చేరే మార్గంలోని అనేక అవాంతరాలను జయప్రదంగా దాటగలిగి ప్రజలను ఒకవిజయాన్ని మరొక విజయానికి నడుపగలుగుతోంది.

అందుకనే కమ్యూనిస్టుపార్టీ తన సభ్యులకు సిద్ధాంత రాజకీయ విద్యను గరిపే విషయానికి అంత గొప్ప ప్రాధాన్యత నిస్తుంది. కమ్యూనిస్టు లందరూ ఎడతెగకుండా తమ వర్గచైతన్యాన్ని యింకా అభివృద్ధి పరచుకోడానికీ మార్క్సిజం - లెనినిజం మూల సిద్ధాంతాలను బాగా అధ్యయనం చేయడానికి కృషి సల్పవలసిందిగా పార్టీ నిబంధనావళి విధిగా నిర్దేశించుతుంది.

ఈ బాధ్యతను పార్టీసభ్యులు ఎంతవరకు నెరవేరుస్తున్నదీ పార్టీ ఎల్లప్పుడూ ఖచ్చితంగా తనిఖీ చేస్తుంది. సిద్ధాంత పరిజ్ఞానాన్ని ఒక కమ్యూనిస్టు ఎంతఎక్కువగా కలిగివుంటే అతడు అంత శక్తివంతంగా పారిశ్రామిక సంస్థల లోనూ, సాంఘిక రాజకీయ జీవితంలోనూ తన నాయకత్వపాత్రను నిర్వహించగలుగుతాడు. ప్రభుత్వ శాఖలలోనూ, పార్టీ కార్యక్రమాలలోనూ, పనిచేసే వర్కర్లు ఎంతటి ఉన్నత రాజకీయస్థాయిని ఎంత ఎక్కువ మార్క్సిస్టు - లెనినిస్టు పరిజ్ఞానాన్ని కలిగివుంటే అంత ఎక్కువగానూ అంత ఫల వంతంగాను ఆ పని నిర్వహించబడుతుంది. ఆ కృషిఫలితాలు కూడా అంతశక్తివంతంగానే ఉంటాయి.

ప్రస్తుత సమయంలో, ప్రజల మనస్సులలో కేపిటలిజం అవశేషాలేమీ లేకుండా చేయడానికి పెద్ద ఎత్తున పార్టీ పోరాటం ప్రారంభించిన యీ సమయంలో పది సంవత్సరాల క్రితం సోవియట్ యూనియన్ కమ్యూనిస్టుపార్టీ 18 వ మహాసభలో కామ్రేడ్ స్టాలిన్ వెలిబుచ్చిన మాటలను యిప్పుడు పునశ్చరణ చేసుకోవడం ఎంతో సముచితంగా వుంటుంది.

"జాతీయ అంతర్జాతీయ పరిస్థితులను తేలికగా అవగాహన చేసుకొని అందుకనుగుణ్యంగా తమ ఎత్తుగడలను మార్చుకొనగలశక్తి లభింపజేయడానికి అన్ని శాఖలలో పనిచేసే కేడరును

సిద్ధాంతరీత్యానూ, రాజకీయంగానూ తగినంత తర్ఫీదును యిచ్చే విషయంలో మనం జయం పొందగలిగితే - వారిని తగినంతగా మార్క్సిస్టు-లెనినిస్టులుగా తయారుచేయగలిగి ముఖ్యమైన పాత్ర పాత్రను నవరింపజేసుకొనగలిగేటట్లు వారిని మనం చేయగలిగితే - మన సమస్యలలో పదింట తొమ్మిదివంతులు అసలు పరిష్కారమైపోయినట్లుగానే మనం తలచవచ్చు."

—ప్రోబ్లమ్స్ ఆఫ్ లెనినిజం

తాను ఎక్కడ పనిచేసినప్పటికీ తన పనిలో నైపుణ్యాన్ని సంపాదించడమేగాక తన దేశభవిష్యత్తును హృదయంలో వుంచుకొని పనిచేసే రాజకీయ, ప్రజానాయకుడుగాకూడా తయారై కమ్యూనిజం విజయంకోసం పోరాడే యోధుల ప్రథమశ్రేణిలో వుండగలందులకు ప్రయత్నించడం ప్రతి కమ్యూనిస్టుయొక్క విద్యుక్త ధర్మం.

సమాజ అభివృద్ధిని గురించిన సూత్రాల జ్ఞానాన్ని సంపాదించడానికి తదేకదీక్షతో కృషిచేయడము కమ్యూనిస్టుపార్టీ ప్రతి సభ్యుని ప్రధాన స్వభావమై వుండాలి. అదే అతని లేక ఆమె చైతన్యానికీ, సిద్ధాంతపరిజ్ఞానానికీ కొలబద్ద.

అయితే కమ్యూనిస్టులను పార్టీ సేతర ప్రజానీకానికి నాయకులుగా తర్ఫీదు చేయడానికి, బోల్షివిక్కు వుండవలసిన సద్గుణాలన్నింటినీ సంపాదించడానికి రాజకీయ విజ్ఞానమొక్కటే సరిపోదనే విషయము ప్రత్యేకంగా చెప్పనవసరం లేదు. ప్రతి కమ్యూనిస్టూ పార్టీ జీవితంలో చురుకుగా తన బాధ్యతను నిర్వహించేటట్లుగానూ, అనేకమందితో సమిష్టిగా కృషిచేసే మిలిటెంట్ సభ్యుడనే మనసత్వాన్ని ఎల్లప్పుడూ పార్టీ సభ్యుడు కలిగివుండేటట్లు యావత్తు పార్టీపని కొనసాగేటట్లు నిర్మాణం జరగాలి. సక్రమంగా నిర్మాణయుక్తమైనపార్టీ సమావేశాలూ, విమర్శనా ఆత్మవిమర్శనా, చక్కగా నిర్ణయించబడిన పార్టీ బాధ్యతలు, అవి ఏవిధంగా కొనసాగించబడుతున్నాయో తెలుసుకోవడానికి ఎప్పటికప్పుడు తనిఖీచేసే విధానం - వీటన్నింటిలో చొరవా, రాజకీయశక్తి కలిగి, తగినంత జాగరూకతతోనూ, పట్టుదలతోనూ పార్టీ విధానంకోసం పోరాడే పరిపక్వం చెందిన మార్క్సిస్టులను తర్ఫీదు చేయటం తప్పనిసరిగా అవసరం.

# III
# పార్టీబలాన్ని నిర్మాణం రెట్టింపు చేస్తుంది

కమ్యూనిస్టుపార్టీ కార్మికవర్గ నాయకత్వమే కార్మికవర్గంయొక్క వర్గ చైతన్యంగల సైనిక దళమే గాక దానియొక్క నిర్మాణయుక్తమైన సైనికదళంకూడా. దీని అర్థం పార్టీ తన సభ్యులందరికీ వర్తించే క్రమ శిక్షణను కలిగి వుంటుదన్న మాట. అంటే పార్టీలోని ప్రతి సభ్యుడూ పార్టీకి చెందిన ఏదోఒక సంస్థలో సభ్యుడుగా వుండాలన్న మాట.

"ఆశయ, ఆచరణల ఐక్యతనూ, క్రమశిక్షణలో ఐక్యతనూ కలిగివున్న ఒకేఒక సైనిక దళంలో తన సభ్యులనందరినీ సంఘటిత పరచ గలిగి నప్పుడు మాత్రమే పార్టీ కార్మికవర్గ పోరాటాన్ని ఆచరణలో నడపగలిగి ఒకే లక్ష్యంపై తన దృష్టిని కేంద్రీకరించ గలుగుతుంది."

—సో. యూ. క. పార్టీ చరిత్ర పేజీ 47

కమ్యూనిస్టుపార్టీ కార్మికవర్గం యొక్క నిర్మాణయుక్తమైనసైనిక దళమని చరిత్రానుభవ మంతా మనకు బోధించుతోంది. లెనిన్ చెప్పినట్లుగా యీారకమైన సైనిక దళాన్ని నిర్మించడంద్వారా "ఒకే ఒక లక్ష్యం, బాగాఅభివృద్ధిచెందిన వేలాది లక్షలాది కార్మికులలక్ష్యం చివరకువర్గలక్ష్యంగామారుతుంది.

సంశ్లిష్టమైన వర్గపోరాట పరిస్థితులలో శ్రామికవర్గ పోరాటానికి పార్టీ సారథ్యం వహించవలసి వుంది. అందువలన పార్టీయేతర ప్రజానీకం క్రమశిక్షణా దృక్పథాన్నీ నిర్మాణశక్తినీ పోరాటంలో ఓర్పునూ సహనాన్నీ అలవరచుకొనేటట్లు చేయాలి. ఇది ఎప్పుడు సాధ్య పడుతుందంటే కామ్రేడ్ స్టాలిన్ చెప్పినట్లు "పార్టీయే స్వయంగా క్రమశిక్షణతోనూ, నిర్మాణశక్తితోనూ మూర్తీభ వించివున్నప్పుడే; పార్టీయే స్వయంగా శ్రామికవర్గంయొక్క నిర్మాణయుక్తమైన సైనికదళంగా వ్యవహరించినప్పుడే."

(ప్రాబ్లమ్స్ ఆఫ్ లెనినిజం 75 పేజీ)

ఏ విధంగా పార్టీ తన అనుయాయులలో ఉత్తమ నిర్మాణాన్నీ క్రమశిక్షణనూ, ఓపికనూ ప్రవేశపెట్టగలదు? అభివృద్ధి చెందినవారినీ, పరీక్షలలో నిగ్గు తేలినవారినీ, కమ్యూనిజం ఆశయంమెడల భక్తి విశ్వాసాలు

కలిగిన వారినీ మాత్రమే సభ్యులుగా చేర్చుకొనేటట్లు పార్టీ ఎల్లప్పుడూ జాగ్రత్తబడాలి. ఈ నియమాన్ని అన్నింటికంటే ముందుగా పార్టీ ఆచరణలో పెట్టాలి. కాబట్టి లెనిన్ స్టాలిన్‌ల పార్టీయొక్క ప్రత్యేక స్వభావమేమంటే అది తన సభ్యత్వ పెరుగుదలను ఒక క్రమపద్ధతిలో రెగ్యులేట్ చేస్తుంది. మహాగొప్పదైన కమ్యూనిస్టుపార్టీ సభ్యత్వానికి అర్హులైన వారిని మాత్రమే చేర్చుకోడానికి అది ఎల్లప్పుడూ జాగ్రత్త తీసుకొంటుంది. ఏదోపరిస్థితులనుబట్టి అభిమానులుగా వచ్చినవారూ లేక ఖచ్చితమైన బూర్జువా జీ ఏజెంట్లూ పార్టీలోకి జొరబడటానికి అవకాశం లేకుండా చేస్తుంది.

లెనిన్ యిలా రాశాడు :

"పార్టీ సంస్థలన్నిటి మొత్తంగా వుండాలని (సంఖ్యారీత్యా కాదు విభిన్న స్వరూపంలో) నేనన్నప్పుడు పార్టీ అగ్రగామి దళముగా సాధ్యమైనంత వరకు అత్యున్నతంగా నిర్మాణాన్ని కలిగివుండాలని నా అభిప్రాయం. నా డిమాండ్. అంతేకాదు, పార్టీ తన నిర్మాణానికి కనీసమన్నా సహాయపడటానికి సిద్ధపడినవారినే సభ్యులుగా చేర్చుకోవాలి. దీనినే నేను స్పష్టంగానూ,ఖచ్చితంగానూ చెప్పదలచాను"
— సెలెక్టడ్ వర్క్సు, సంపుటి 1 పేజి 297

పార్టీ తన సభ్యత్వాన్ని అతి శ్రద్ధతో రెగ్యులేట్ చేస్తుంది. ఎందువల్లననగా స్టాలిన్ చెప్పినట్లు "దాని వసిపై సభ్యత్వపు ప్రభావము వుంటుందని పార్టీకి తెలుసు"

పార్టీలో ఉక్కువంటి ఐక్యతా నిర్మాణం వుండాలనేభావం పార్టీ నిబంధనావళి అంతటా వుంటుంది. సోవియట్ యూనియన్ కమ్యూనిస్టుపార్టీ నిబంధనావళి ప్రకారం సభ్యులను ఒక్కొక్కరినే - సభ్యత్వానికి దరఖాస్తు చేసిన ప్రతివారి వ్యక్తిగతగుణాలనూ-అతనిసిద్ధాంత స్థాయినీ, అతని రాజకీయ చైతన్యాన్నీ, కార్మికవర్గ ఆశయం యెడల అతనికున్న భక్తివిశ్వాసాలనూ-అన్నింటినీ జాగ్రత్తగా పరిశీలించిన తరువాతనే వారిని సభ్యులుగా తీసుకోవడం జరుగుతుంది.

పార్టీ నిబంధనావళి మొదటి పేరాలో వివరించబడినట్లు పార్టీలోని సభ్యత్వాన్ని లెనిన్ యిలా నిర్వచనం చేశాడు. కార్మికవర్గ నిర్మాణ యుక్తమైన సైనిక అగ్రగామి దళమనే భావంపైనా, కార్మిక వర్గంలోని ఒకే రకమైన ఆలోచనావిధానాన్నేగాక ఒకే విధమైన కార్యాచరణను గలిగిన ఉత్తమోత్తమమైన వారి సుసంఘ

టిత సంస్థ అనే భావం పైనా కమ్యూనిస్టుపార్టీ ఆధారపడి వుంటుంది. తన ప్రయోజనాలూ, తన వాంఛలూ, పార్టీ ప్రయోజనాలతోనూ, వాంఛలతోనూ, పూర్తిగా మిళితం చేసిన ఖచ్చితమైన పోరాట యోధుడే తన కార్యక్రమ నిర్వహణలో పార్టీ ఎదుర్కొనవలసిన అన్ని కష్టాలకూ నష్టాలకు ఓర్పుతో సహించడానికి సిద్ధపడినవాడే కమ్యూనిస్టుపార్టీ సభ్యుడుగా వుండడానికి అర్హుడు.

పార్టీలోని సభ్యత్వానికి లెనిన్ నిర్దేశించిన సూత్రాలను బ్రహ్మాండంగానూ, విపులంగాను సమర్థించుతూ కామ్రేడ్ స్టాలిన్ తన "శ్రామికవర్గం శ్రామికవర్గపార్టీ" అనే గ్రంథంలో యిలా రాశాడు.

"పార్టీలోని సభ్యుడుగా వుండదలచినవారు పార్టీ యొక్క కార్యక్రమాన్నీ, ఎత్తుగడలనూ, నిర్మాణ సూత్రాలనూ అనుసరించితీరాలి. పార్టీ సిద్ధాంతాలను అనుసరించాలంటే పార్టీ సిద్ధాంతాలకోసం పోరాడాలి. ఈ సిద్ధాంతాలకొరకు పోరాడాలంటేపార్టీ సంస్థలో పనిచేయవలసి వుంటుంది. పార్టీతోపాటు కలసి పనిచేయవలసి ఉంటుంది. పార్టీలో సభ్యుడుగా వుండాలంటే ఏదోఒకపార్టీ సంస్థలో తప్పక చేరవలసివుంటుంది. మనం పార్టీ సంస్థలలో చేరి ఆ విధంగా మన వ్యక్తిగత ప్రయోజనాలను పార్టీ ప్రయోజనాలతో మిళితం చేయగలిగినప్పుడే మనం పార్టీలో సభ్యులం కాగలం. అప్పుడే మనం శ్రామికుల సైన్యానికి నిజమైన నాయకులం కాగలం."

— స్టాలిన్ రచనలు (రష్యన్) సంపుటి 1 పేజీ 66 - 67

కమ్యూనిస్టుపార్టీ సభ్యత్వానికి సంబంధించిన యీ లెనిన్ - స్టాలిన్ సూత్రాలను వుల్లంఘించిన పక్షంలో అది తప్పనిసరిగా పార్టీని అజ్ఞానుల, శత్రు ఏజెంట్ల, ఇతర విచ్ఛిన్నకర శక్తుల ఆటపట్టుగా తయారుచేస్తుంది. ఇక వారు పార్టీలోవుండి పార్టీక్రమశిక్షణను భంగపరచి దాని పాలసీని సామ్రాజ్యవాదుల అవసరాల కనుగుణ్యంగా తయారు చేయడానికి ప్రయత్నిస్తారు.

సరిగా యిదే రష్యన్ మెన్షివిక్‌ల విషయంలో జరిగింది. 1903 లోనే వారు పార్టీకి ఏదో కొంత సహాయంచేసిన ప్రొఫసర్లకు, హైస్కూలు విద్యార్థులకు సహితం పార్టీ సభ్యత్వాన్ని యిచ్చే పద్ధతిని ప్రతిపాదించారు. ఈ విధంగా వారు ఒక అగ్రగామిదళాన్ని వర్గ చైతన్యాన్ని కలిగిన నిర్మాణ యుక్తమైన కార్మికవర్గ సైనిక దళాన్ని గాక విభిన్నతత్వాలుగల,

క్రమశిక్షణలేని, నిర్మాణయుక్తం కాని పార్టీని సృష్టించడానికి ప్రయత్నించారు. చివరకు మెన్షివిక్‌లు కార్మికవర్గ ఆశయానికే ద్రోహం చేసి, సామ్రాజ్యవాద శిబిరంలో చేరిన విషయం మనందరికీ తెలిసిన సంగతే.

ఈ కారణం మూలంగానే ప్రపంచంలోకెల్లా పెద్దకార్మికపార్టీ అయినజర్మన్‌సోషల్‌డెమోక్రటిక్ పార్టీ ప్రథమ ప్రపంచయుద్ధకాలంలోనే సామ్రాజ్యవాదుల గులాముగా తయారైంది. ఆయుద్ధం తరువాత యీపార్టీ తనకడివరకున్న ప్రాముఖ్యతను కోల్పోయింది. అది ఆ విధంగా కార్మికవర్గ ఆశయానికి ద్రోహం చేయడానికి గల ముఖ్యకారణాలలో ఒకటేమంటే చాల సంవత్సరాలుగా అది "పార్టీలోని మూలజీవనశక్తిని నాశనంచేసే నానారకాల ఛోటా బూర్జువా గుంపును సభ్యత్వంగా అంగీకరించి ఆవిధంగా తన సంస్థలను విస్తరింపజేసే" విధానాన్ని అనుసరించడమే

—స్టాలిన్, రచనలు (రష్యన్)
సంపుటి 5 పేజీ 99

యుగోస్లోవియా కమ్యూనిస్టు పార్టీలో కమ్యూనిజం ఆశయము యెడల భక్తివిశ్వాసాలు గలిగినవారిని మాత్రమే పార్టీలోకి సభ్యులుగా తీసుకోవాలనే లెనిన్ సూత్రాన్ని అతిక్రమించి బూర్జువా జాతీయవాదులను పార్టీలోకి జొరబడటానికి అవకాశంకలిగించడమే, నేటి పార్టీ నాయకత్వం మార్క్సిజం-లెనినిజంయొక్క కార్యకను, ఎత్తుగడల, నిర్మాణ సూత్రాలను పూర్తిగా పరిత్యజించడానికి నిస్సందేహంగా ప్రధాన కారణం. దాని ఫలితంగా అగ్రగామిదళంగానూ, వర్గ చైతన్యం గలిగిన నిర్మాణయుక్తమైన కార్మికవర్గ సైనికదళంగా యుగోస్లోవియా కమ్యూనిస్టుపార్టీ అస్థిత్వమే నేడు ప్రమాదంలో పడిపోయింది.

పార్టీలోని ప్రతి సభ్యుడూ, ప్రతి పార్టీ సంస్థ పార్టీయొక్క సత్వర, అంతిమ ఆశయాలను గురించి స్పష్టమైన అభిప్రాయాన్ని కలిగివుండటమేగాక పార్టీ ఆశయ సాధనకు వారు ఆత్మత్యాగముతో పోరాడవలసి వుంటుంది. అన్నింటికంటే ముందు పార్టీ ప్రయోజనాలకే ప్రథమస్థానం ఇవ్వవలసి వుంటుంది. పార్టీ, కార్మిక సంఘాల, రాజ్యాంగ వ్యవహారాలకు సంబంధించిన పనులలో

ఆదర్శమైన క్రమశిక్షణను కనపరచాలి. పార్టీ ఆంతరంగిక జీవితానికి సంబంధించిన సూత్రాలను, నిబంధనలనూ వ్యక్తపరచే పార్టీ నిబంధనావళిని వారు ఖచ్చితంగా అమలుపరచవలసివుంటుంది. వీటినే కమ్యూనిస్టుపార్టీ తన పార్టీ సభ్యులనుండీ, పార్టీ సంస్థలనుండీ డిమాండ్ చేస్తుంది.

ఆ కార్యాచరణ నిర్ణయాలన్నీ పార్టీ సభ్యులందరికీ వర్తింపజేసే నిబంధనతోనూ, పై కమిటీలు క్రింది కమిటీలూ కలిసి మెజారిటీ నిర్ణయాలనూ మైనారిటీ శిరసావహిస్తూ సుసంఘటిత సంస్థలతో ఒకేఒక ఏకీకృతసంస్థయే పార్టీ అవుతుందని పార్టీ నిబంధనావళి పేర్కొంటున్నది.

స్టాలిన్ యిలా రాశాడు.

"ఈ నియమాలు లేకుండా పార్టీ కార్మికవర్గ పోరాటంలో క్రమబద్ధమైన నిర్మాణ యుక్తమైన నాయకత్వాన్ని యివ్వగలిగిన ఒకేఒక నిర్మాణ యుక్తమైన సంస్థ కాజాలదు."

— ప్రోబ్లమ్స్ ఆఫ్ లెనినిజం పేజీ 76

ఈ రకమైన నిర్మాణాన్ని కలిగివుండటం మూలంగానే లెనిన్-స్టాలిన్‌ల పార్టీ ఒకేలక్ష్యంగలిగి, లక్షలాది కార్మికులను ఒకే ఒక ఆశయసిద్ధికి నడిపించడానికి సమాయత్తపరచే నిజమైన ఉక్కు శిక్షణ గలిగిన ఏకీకృత సంస్థను ప్రతిబింబిస్తుంది.

# IV

# కమ్యూనిస్టుపార్టీ - కార్మికవర్గ నిర్మాణంయొక్క అత్యున్నత స్వరూపం

కార్మికవర్గ నిర్మాణ రూపాలన్నింటిలోకి అత్యున్నత స్వరూపమే కమ్యూనిస్టుపార్టీ అని లెనినిజం బోధించుతుంది. ఎందువల్లనంటే కార్మికవర్గ సంస్థలన్నింటికీ శ్రామిక ప్రజల సంస్థలకూ, రాజ్యాంగ సంస్థలకూ, సారధ్యం వహించి నడపడమే కమ్యూనిస్టు పార్టీ పవిత్రవిధి. అనేకసంవత్సరాల తన కార్యాచరణ ఫలితంగా బోల్షివిక్ పార్టీ నాయకత్వ పాత్రను కార్మికవర్గమే గాక సోవియట్ యూనియన్‌లోని శ్రామిక ప్రజలందరూ ఎలాంటి మినహాయింపూ లేకుండా గుర్తిస్తారు.

కమ్యూనిస్టు పార్టీ యేగాక కార్మిక వర్గానికి ట్రేడ్ యూనియన్‌లూ, సహకార సంఘాలూ, యువజన సంఘాలూ, మహిళా సంఘాలూ, సోవియట్లూ, సాంస్కృతిక, విద్యాసంస్థలులాంటి అనేక సంస్థలుంటాయి. సోవియట్ యూనియన్ రాజ్యాంగచట్టంలో పేర్కొనబడినట్లుగా సో. యూ. క. పార్టీ సోషలిస్టు వ్యవస్థను బలపరచి, అభివృద్ధి పరచుకోడానికి కొనసాగించేపోరాటంలో శ్రామిక ప్రజల అగ్రగామి.

అందరికీ సమానమైన లక్ష్యసిద్ధికి కార్మికవర్గ సంస్థల నన్నింటిని నడుపగల శక్తి సామర్థ్యాలుగల సంస్థ అని కమ్యూనిస్టుపార్టీ తన ఆత్మత్యాగ కృషిద్వారా రుజువు చేసుకొన్నది.

కామ్రేడ్ స్టాలిన్ యిలా చెప్పాడు.

"ఇందు కవసరమైన లక్షణాలన్నీ పార్టీకున్నాయి. ఎలాగంటే:

ఒకటి: పార్టీకి చెందని శ్రామిక వర్గ సంస్థలతో ప్రత్యక్ష సంబంధాలను కలిగివుండి తరచు వాటిని నడుపుతూ వుండే కార్మికవర్గంలోని ఉత్తమోత్తము మైన వారి నందరినీ సమీకరించే కేంద్రమే పార్టీ.

రెండు: కార్మికవర్గంలోని ఉత్తమోత్తమ సభ్యులను సమీకరించిన కేంద్రమైనపార్టీ తను వర్గసంస్థలన్నింటినీ నడుపగలిగిన కార్మికవర్గ నాయకు లందరికి తర్ఫీదు నివ్వడానికి ఉన్నతమైన శిక్షణాకేంద్రం.

మూడు: కార్మికవర్గ నాయకు లందరికీ శిక్షణనిచ్చే ఉత్తమశిక్షణ కేంద్రంగా పార్టీ తనయొక్క అనుభవం, ప్రతిష్ఠవల్ల శ్రామికవర్గ పోరాట నాయకత్వాన్ని కేంద్రీకరించుటకూ, పార్టీయేతర కార్మికవర్గ సంస్థ లన్నింటినీ పార్టీకీ కార్మికవర్గానికి మధ్య లింకులుగావుండే సహాయ సంస్థలుగా మార్చుటకు తగిన కేంద్రం."

(ప్రోబ్లమ్స్ ఆఫ్ లెనినిజం, పే. 86.

అధికార స్వీకరణకై పోరాడేందుకు శ్రామికవర్గాన్ని సమాయత్తపరచడానికి తీవ్రమైన కృషి సల్పుతున్నప్పుడే బోల్షివిక్ పార్టీ విపరీతమైన ప్రతికూలపరిస్థితులలో కూడా శ్రామికవర్గ విప్లవకర పోరాటాన్ని జయప్రదంగా నడపగలిగిన తనశక్తి సామర్థ్యాలను రుజువు చేసుకొన్నది. ఆ పోరాట అగ్నిలో యావత్తు ప్రజానీకాన్నీ సోషలిజానికి నడుపశక్తిగల కార్మికవర్గ అగ్రగామిగా పార్టీ అభివృద్ధిచెంది బలాన్ని సంపాదించింది. నూతన వ్యవస్థను నిర్మించి నడుపగలశక్తిగానూ, శ్రామిక ప్రజల గురువు, నాయకుడుగాను పార్టీ అభివృద్ధి చెందింది.

సోషలిస్టు విప్లవ విజయానంతరం బోల్షివిక్ పార్టీ నాయకత్వ పాత్ర యింకా అత్యధికంగా హెచ్చింది.

పురోగామివర్గంయొక్క విప్లవ శక్తినంతటినీ అంతర్లీనం చేసుకొ గలిగిన పార్టీ నాయకత్వం లేకుండా శ్రామికవర్గం తన నియంతృత్వాన్ని నిలబెట్టుకొని సంఘటితపరచుకో లేదు. నూతన సోషలిస్టు సమాజాన్ని నిర్మించలేదు. "ప్రధాన నిర్మాణశక్తి పాత్రను నిర్వహించే పార్టీ లేకుండా శ్రామికవర్గ నియంతృత్వం ఎంతో కాలం నిలబడగలగడం గాని, గట్టిగా వుండడంగానీ అసాధ్యం." (స్టాలిన్, ప్రోబ్లమ్స్ ఆఫ్ లెనినిజం) సోవియట్ యూనియన్ లో రాజ్యాంగానికీ, ఆర్థిక నిర్మాణానికీ సంబంధించి ఏ ప్రధాన సమస్య కూడా పార్టీ సలహా సారథ్యాలు లేకుండా నిర్ణయించబడదు.

కార్మిక, కర్షక జనసామాన్యానికీ, పార్టీకి మధ్య సంబంధాన్ని కలుగజేసి ఒకవిధమైన లింకుగా పనిచేసే పార్టీయేతర ప్రజాసంస్థల ద్వారా సోషలిస్టు రాజ్యాంగం ఆంతరంగిక, విదేశాంగ పాలసీలలో పార్టీ తన నాయకత్వాన్ని చెలాయించుతుంది.

కమ్యూనిస్టుపార్టీ ప్రభుత్వ సంస్థలైన సోవియట్ల ద్వారానూ, ప్రధానంగా రాజ్యాంగవ్యవహారాలలో పాల్గొనే విశాల శ్రామికజన సామాన్యంతో పార్టీకి సన్నిహిత సంబంధాన్ని కలిపే ప్రధాన ప్రజా సంస్థల ద్వారానూ; దాదాపు యావత్తు కార్మికవర్గానికీ సంబంధించి, రాజ్యాంగ వ్యవహారాలలోనూ, కమ్యూనిస్టు సిద్ధాంతాలలోనూ శిక్షణను గరిపే శిక్షణా కేంద్రాలుగా వుంటే ట్రేడ్‌యూనియన్ల ద్వారానూ, యువకులకు కమ్యూనిస్టువిజ్ఞానాన్నిగరిపి, వారిని కమ్యూనిజాన్ని నిర్మించే నూతన నిర్మాణశక్తులుగా తర్ఫీదు నిచ్చే యువక కమ్యూనిస్టు సంఘాల ద్వారానూ, సహకారసంఘాలు మరి యితర ప్రజాసంస్థల ద్వారానూ దేశంలోని ప్రజాజీవితాన్ని నడుపుతుంది.

సోవియట్లు, ట్రేడ్‌యూనియన్లు, శ్రామిక ప్రజలకు సంబంధించిన యితరసంస్థల కృషి, నడకా విప్లవయుతంగా వుంటాయనడానికి పార్టీయొక్క సరియైన రాజకీయ నాయకత్వమే గ్యారంటీ.

కార్మికవర్గ నిర్మాణం యొక్క అత్యున్నత స్వరూపంగా కమ్యూనిస్టుపార్టీ పాత్రను ఏ మాత్రంగా కొంచె పరచడానికి ప్రయత్నంచేసి నప్పటికీ, అది శ్రామిక ప్రజల శత్రువుల చేతులలోకి తీసుకొని వెళ్ళడానికి దారి తీస్తుందని విప్లవోద్యమం యొక్క అనుభవం బోధించుతోంది. సోవియట్ రిపబ్లిక్‌లో జరిగిన అంతర్యుద్ధం అనంతరం, 1920లో కమ్యూనిస్టు పార్టీలో చిన్నచిన్న పార్టీ వ్యతిరేక గ్రూపులు తయారై దేశంలో పార్టీ నాయకత్వ పాత్ర ఏమీ లేకుండా తగ్గించివేయడానికి ప్రయత్నించాయి. ఉదాహరణకు "కార్మికుల ప్రతిపక్షం" అనే సంస్థ యావత్తు జాతీయ ఆర్థిక విధాన నిర్వహణ "అఖిల రష్యా ఉత్పత్తిదారుల సంఘం" అన్న సంస్థ యాజమాన్యానికి వదలివేయాలనే సోవియట్ వ్యతిరేక డిమాండ్‌ను ప్రవేశపెట్టింది. నిజానికి ఈ డిమాండును అంగీకరించడం అంటే ఆచరణలో కార్మికవర్గ నిర్మాణ అత్యున్నత స్వరూపంగా పార్టీని రద్దు చేసుకోవడమే అవుతుంది. సో.యూ.క. పార్టీ చరిత్రలో (253 పేజీ) ఉదహరించినట్లుగా ట్రేడ్‌యూనియన్ల ప్రయోజనాలు సోవియట్ ప్రభుత్వం కమ్యూనిస్టు పార్టీ ప్రయోజనాలకూ పూర్తిగా విరుద్ధమని "కార్మికుల ప్రతిపక్షం" వాదించింది. కార్మికవర్గ నిర్మాణ అత్యున్నత స్వరూపం ట్రేడ్ యూనియన్‌లుగాని, పార్టీ ఎంత మాత్రమూ కాదని పైసంస్థలాంటివి అభిప్రాయపడ్డాయి. "కార్మికుల ప్రతిపక్షం" అసలు సారాంశంలో అరాజక సిండికలిస్టుపార్టీ వ్యతిరేక గ్రూపు ట్రాట్స్కీ-యైట్లూ, "కార్మికుల ప్రతిపక్షం" యింకా యితర వ్యతిరేకుల పార్టీ వ్యతిరేక భావాల ఉద్దేశ్యం సోవియట్లలోనూ, ట్రేడ్ యూనియన్లలోనూ, పార్టీయొక్క నాయకత్వ పాత్రను కొంచె పరచడమే వీరి భావాలను తమ కుట్రలకుఅనుగుణ్యంగా వినియోగ పరచకోడానికి దేశమంతటా బూర్జువాజీ, వైట్‌గార్డ్సువెంటనే ప్రయత్నించారు. "క్రోన్‌స్టట్ తిరుగుబాటు"లో నిదర్శనంగా కనబడినట్లుగా 1921 లో వైట్ గార్డ్సుచే ప్రోత్సాహించబడినసోషలిస్టు విప్లవ శత్రువులు తాము ద్వేషించే కార్మికవర్గ నియంతృత్వాన్నీ, కమ్యూనిస్టుపార్టీ నాయకత్వాన్నీ కూలద్రోయడానికి యిష్ట

పడిన పక్షంలో సోవియట్ల నినాదా
లను సహితం అంగీకరించడానికి
సిద్ధపడ్డారు.

లెనిన్ స్టాలిన్‌లపార్టీ టాట్స్కీ
వాదులనూ, "కార్మికుల ప్రతి
పక్షాన్ని" యింకా యితర వ్యతి
రేకులనూ చావుదెబ్బకొట్టి దేశం
లోని శత్రువు ఏజెంట్ల ప్రమాద
కరమైన కార్యక్రమాన్ని భగ్న
పరచింది. కార్మికవర్గ నిర్మాణం
అత్యున్నత స్వరూపంగా పార్టీ
పాత్రను కొంచెపరచే అరాచక
సిండికలిస్టుల ప్రచారం కమ్యూ
నిస్టుపార్టీ సభ్యత్వానికే పూర్తిగా
విరుద్ధమైనదని ప్రకటించబడింది.

మార్క్సిస్టు-లెనినిస్టు సిద్ధాం
తము ప్రకారం కమ్యూనిస్టుపార్టీ
దేశంలో ప్రధాన సారధ్యశక్తి.
దానికి ప్రత్యేక కార్యక్రమము
వుంది. పార్టీయేతర ప్రజలలో అది
రద్దయిపోకుండా పార్టీ జాగ్రత్త
తీసుకొంటుంది పార్టీ కార్మికవర్గం
నిర్మాణంయొక్క అత్యున్నత
స్వరూపం. దానియొక్క అతి
ముఖ్యమైన ఆయుధం కూడా.
కామ్రేడు స్టాలిను మాటలలో
చెప్పాలంటే పార్టీయేతర సంస్థల
"స్వాతంత్ర్యం", "తటస్థ
విధానం" అనే సిద్ధాంతం పార్టీ
నుండీ, కార్మికవర్గాన్నుండీ వేరుగా
వున్న పార్లమెంటు సభ్యులనూ
పాత్రికేయులనూ ( జర్నలిస్టులు )
సంకుచితబుద్ధిగల ట్రేడుయూనియ
నిస్టులుగానూ, సహకార సంస్థల
ఉద్యోగులుగానూ, అజ్ఞానములో
వున్న శత్రువులుగా తయారు
చేస్తుంది. అలాంటి సిద్ధాంతానికీ
లెనినిజం యొక్క సిద్ధాంత ఆచరణ
లకూ ఎలాంటి సంబంధమూ లేదు.

పార్టీయొక్క మార్క్సిస్టు-
లెనినిస్టు సిద్ధాంతాన్ని యుగోస్లో
వియాలో టిటోముఠా పూర్తిగా
వక్రమార్గాన్ని పట్టించింది. అది
ప్రధానసారధ్యశక్తిగా కమ్యూనిస్టు
పార్టీని గాక జాతీయ సంఘటనా
సంస్థనే (నేషనల్ ఫ్రంట్) పరిగ
ణించించి. యుగోస్లోవియా
కమ్యూనిస్టుపార్టీ పరిస్థితిపై
కమ్యూనిస్టుపార్టీల సమాచార
శాఖ తీర్మానం ప్రకటించినట్లుగా
యుగోస్లోవియా నాయకులు
కమ్యూనిస్టుపార్టీ పాత్రను హీన
పరచారు. నిజానికి పార్టీని పార్టీ
యేతర సంస్థ అయిన జాతీయ
సంఘటనా సంస్థలో (నేషనల్
ఫ్రంట్) ఒకదానిగా కలిపివేశారు.
ఈ జాతీయసంఘటనలో వర్గరీత్యా
నానారకాలైన పరస్పర విరుద

శక్తులు (కార్మికులు, వ్యక్తిగతంగా రైతులూ, ధనికరైతులూ, వ్యాపారస్థులూ, చిన్న చిన్న ఉత్పత్తిదారులూ, బూర్జువా మేధావులూ వగైరా) వున్నాయి. అంతేకాదు; అందులో వివిధ దృక్పథాలు కలిగిన రాజకీయ గ్రూపులూ, కొన్నిబూర్జువా పార్టీలు సహితం వున్నాయి.

అదే తీర్మానంలో ఉదహరించి నట్లుగా, యుగోస్లావియా రాజకీయరంగంలో జాతీయసంఘటనా సంస్థయే ప్రముఖంగా కనపడటం, కమ్యూనిస్టుపార్టీ దాని సంస్థలూ ప్రజలముందుకు బహిరంగంగా రాకపోవడం, — యిదంతా దేశ రాజకీయజీవితంలో పార్టీ పాత్రను పూర్తిగా కొంచె పరచడమే గాక ఒక స్వతంత్ర రాజకీయ శక్తిగా పార్టీ మనకుండా చేస్తున్నది. పార్టీ ఒక స్వతంత్ర రాజకీయశక్తిగా వ్యవహరించుతూ, సాధ్యమైనంత అధికంగా ప్రజల విశ్వాసాన్ని చూరగొంటూ, తన బహిరంగ రాజకీయ కార్యాచరణ ద్వారా, బహిరంగంగా తన సిద్ధాంతాలను ప్రచారం చేయడం ద్వారానూ, బహిరంగంగా తన కార్యక్రమాన్ని అమలు జరపడం మూలంగానూ అశేషశ్రామికజన సామాన్యంపై ఎక్కువెక్కువగా తన పలుకుబడిని విస్తరింప జేసుకోవాలి. మార్క్సిస్టు పార్టీ పార్టీయేతర ప్రజాసంస్థలలో రద్దుకావాలన్న రష్యన్ మెన్షివిక్‌ల తప్పులనే యుగోస్లావియా కమ్యూనిస్టుపార్టీ నాయకులు తిరిగి చేస్తున్నారు.

పార్టీయేతర సంస్థల యెడల పార్టీ విధులను ఏరూపంలో గందరగోళం పరచి (కన్‌ఫ్యూజ్) నప్పటికీ ఆచరణలో దాని ఫలితం మాత్రం కమ్యూనిస్టు పార్టీ నాయకత్వపాత్రను బలహీనపరచడమే అవుతుంది.

పార్టీ సంస్థలు పార్టీయేతర సంస్థలస్థానాన్ని తీసుకోవడంగానీ, లేక వాటిపై ఆజ్ఞలను జారీ చేసే ప్రయత్నంగానీ పార్టీ నాయకత్వాన్ని సరిగా నిర్వహించడం కాదు సరికదా పైపెచ్చు అది పార్టీ ఆశయానికి హానిని కూడా కలుగజేస్తుంది.

లెనిన్-స్టాలినులసిద్ధాంతంప్రకారం పార్టీ ప్రజలలోనూ, రాజ్యాంగ సంస్థలలోనూ వాటిపై ఆర్డర్లు జారీ చేయడంమూలంగాగానీ, లేకవాటి స్థానాన్ని తీసుకోవడంద్వారాగాని

తన నాయకత్వాన్ని చెలాయించరాదు. ఆ సంస్థలలో పని చేసే కమ్యూనిస్టులద్వారానూ, వాటి కార్యక్రమాలను అన్ని విధాలా సహాయపడటం మూలంగాను పార్టీ తన నాయకత్వాన్ని చెలాయించగలగాలి. 1919 లో జరిగిన బోల్షివిక్ పార్టి 8వ మహాసభ నిర్మాణ సమస్యలపై తన తీర్మానంలో ఉదహరించినట్లుగా "ఎటువంటి పరిస్థితులలోనూ సోవియట్లకు జవాబుదారీగావుండే రాజ్యాంగ సంస్థల విధులతో పార్టీసంస్థల విధులను కలగాపులగం చేయరాదు. అలా కలగాపులగం చేసి ఉభయుల విధులను గందరగోళపరచడంమూలంగా ప్రమాదకరమైన ఫలితాలకూ ముఖ్యంగా మిలిటరీరంగాలల్లో దారితీయవచ్చు. పార్టీ తన నిర్ణయాలను సోవియట్ రాజ్యాంగానికి లోబడి సోవియట్ సంస్థలద్వారా కొనసాగేటట్లు చూడాలి. సోవియట్ల కార్యకలాపాలను తన సలహాలనిచ్చి నడిపించాలి గాని పార్టీ వాటి స్థానాన్నే ఆక్రమించుకోరాదు."

తమ నాయకత్వాన్ని తను "తమ శక్తిసామర్థ్యాలవలనూ, తమసిద్ధాంతాల పలుకుబడిద్వారా సంపాదించుకోవాలని (పార్టీలోని తమ హోదాలవల్ల కాదు)" బోల్షివిక్లకు లెనిను యిలా బోధించాడు.

శ్రామికవర్గ విప్లవ విజయానికి ముందు తాను కార్మికవర్గ సంస్థల కార్యకలాపాలు రహస్యంగా నడుపవలసిన రోజులలోపార్టీ ఈ సలహానే అనుసరించింది. ఈనాడు కూడా కమ్యూనిస్టు సమాజ నిర్మాణానికి జరిగే పోరాటంలో యావత్తు శ్రామిక ప్రజానీకమూ లెనిను స్టాలినుల పార్టీని తమ అగ్రగామిగా పరిగణించుతున్న సమయంలో సహితం యీ సూత్రాన్నే పార్టీ అనుసరించుతోంది.

# V

## ప్రజానీకంతో సన్నిహిత సంబంధమే కమ్యూనిస్టు పార్టీ అజేయ శక్తికి పునాది

లెనిన్ స్టాలిన్ల ఉపదేశాల ప్రకారం కార్మికవర్గ అగ్రగామికి కోటానుకోట్ల శ్రామిక ప్రజలతో గల సంబంధబాంధవ్యమే కమ్యూనిస్టుపార్టీలో మూర్తిభవించుతుంది. పార్టీయేతర ప్రజానీకంతో సన్నిహిత సంబంధాలు లేకుండా ఆసంబంధాలను రెట్టింపు చేసుకొని

బలపరచుకోకుండా పార్టీ జీవించ లేదు, అభివద్ధి కాలేదు.

అందుకనే లెనిన్ స్టాలిన్‌ల పార్టీ విప్లవ పోరాటంలోని అన్ని దశలలోనూ తన నిర్మాణ, ప్రచారక, ఆందోళనా కార్యకలాపాలను ఎలాంటి పరిస్థితులలోనైనా పార్టీయేతర జనసామాన్యంతో గల తన సంబంధాలను మరింత దిట్టపరచే విధానంలోనే తప్పని సరిగా కొనసాగించింది.

శ్రామిక ప్రజాకోటిని శక్తివంతంగా సమీకరించడంమూలంగానే బోల్షివిక్కులు తమ లక్ష్యానికి చేరుకొనే మార్గంలో ఎన్ని కష్టాలు, ఎన్ని అవాంతరాలు వచ్చినప్పటికీ వాటి నన్నింటినీ అధిగమించి పురోగమించారనే సత్యాన్ని సో. యూ. క. పార్టి యావత్తు చరిత్రా లెనిన్, స్టాలిన్ లాంటి కమ్యూనిస్టు మహానాయకుల జీవితాలూ, వారి కార్యకలాపాలూ చాటిచెప్పుతున్నాయి. జైలులోనూ, ప్రవాసంలోనూ, వున్నప్పుడు సహితం లెనిన్ కార్మికోద్యమాన్ని నడిపాడు. వర్కర్లను ఉద్దేశించి కరపత్రాలు వ్రాశాడు పార్టీనాయకులతో ఉత్తర ప్రత్యుత్తరాలు కొనసాగించాడు. 1902 నుండి 1913 వరకూ జరిగిన దశలో స్టాలిను ఏడుసార్లు అరెస్టు చేయబడ్డాడు. ఆరుసార్లు ప్రవాసానికి పంపబడ్డాడు. ప్రవాసాన్నుండి అయిదుసార్లు తప్పించుకొన్నాడు. ఎల్లప్పుడూ, ప్రతి సమయంలోనూ విపరీతమైన విపత్కర పరిస్థితులలో కార్మికవర్గ సైనిక నాయకుడు శ్రామిక ప్రజలతో తన సన్నిహిత సంబంధాలను ఎలా బలపరచుకొని విస్తరింపజేసుకోడానికి కృషిచేయాలో అలాంటి ఉత్తమాదర్శాన్ని స్టాలిను చూపెట్టాడు.

సరియైన నిర్ణయాలను చేయగలగడానికి పార్టియేతర కార్మికవర్గ జనసామాన్యంతో పార్టీ అతి సన్నిహితసంబంధాలను వుంచుకోవడం అత్యావసరం. సరియైన నిర్ణయాలు చేయడంలో ఇది ఎంతో సహాయపడుతుంది.

స్టాలిన్ చేసే ప్రతి ప్రసంగాన్నీ, ప్రతి ప్రకటననూ సోవియట్ ప్రజలంతా ఎంతో ఉత్సాహంగా స్వీకరిస్తారు. ఎందువల్లనంటే స్టాలిన్ ప్రసంగాలు శ్రామిక ప్రజల, రైతుల, మేధావుల వాంఛలనూ, ఆశలనూ, అనుభవాల్నీ ఎంతో

తేలికగానూ, విస్పష్టంగాను ప్రతి బింబిస్తాయి.

కమ్యూనిస్టుపార్టీ, సోవియట్ ప్రభుత్వాల నిర్ణయాలు, పథకాలు కూడా సరిగ్గా పైధోరణిలోనే వుంటాయి. వాటిలోని ప్రతిఒక్క దానిలోనూ సోషలిస్టు సమాజ నిర్మాతలయొక్క మహత్తరానుభవాలూ; సామాన్యవర్కర్ల నాయకుల అనుభవాలూ కేంద్రీకరించబడివుంటాయి. ఈరకమైన అనుభవాన్ని అత్యధికంగా గడించగలగడం, కార్మికుల కర్షకుల వాణిని అతి జాగ్రత్తగా వినడం యివన్నీ సరియైన నిర్ణయాలకు రావడానికి ఎంతో ఎక్కువగా సహాయపడతాయి. ఏదైనా సమస్యకు సరియైన, సక్రమమైన పరిష్కారాన్ని కనుగొనాలంటే నాయకుల అనుభవానికి కార్మికజనసామాన్యముయొక్క అనుభవాన్ని తోడు చేయడం ఎంతో అత్యవసరం.

స్టాలిన్ యిలా చెప్పాడు :

"నాయకులైన మేము విషయాలనూ, సంఘటనలనూ, ప్రజలనూ ఒకవైపునుండి మాత్రమే-నాఉద్దేశ్యములో పైనుండే చూస్తాం. అందువలన మా దృష్టికోణం కొంతవరకు పరిమితమైనదేనని చెప్పవచ్చు. మరొక వైపున జనసామాన్యం విషయాలనూ, సంఘటనలనూ, ప్రజలనూ మరొకదృక్పథాన్నుండి - అంటే నాఉద్దేశ్యంలో క్రింది నుండి చూస్తారు. అందువలన వారి పరిశీలనావిధానం కూడా కొంతవరకు పరిమితమైనదే. ఒక్క -సమస్యకు సరియైన పరిష్కారమార్గాన్ని కనుగొనాలంటే యీ రెండు రకాల అనుభవాల్నీ జతపరచడం అవసరం."

కాబట్టి ప్రజాసామాన్యంతో సన్నిహిత సంబంధాలే పార్టీకి సరియైన పరిష్కార మార్గాల కనుగొనడానికి సహాయపడతాయి. అయితే ఉత్తమమైన తీర్మానంతోనే పనంతా పూర్తికాదు. అది ప్రారంభం మాత్రమే. సరియైన పరిష్కారమార్గాన్ని కనుగొన్న తరువాత ఆ తీర్మానాన్ని ఆచరణలో పెట్టడానికి అవసరమైన పోరాటాన్ని ఆర్గనైజు చేయడం పైనా, ఆ పోరాటంలో విశాల శ్రామిక జనసామాన్యం పాల్గొనడంపైనా విజయం ఆధారపడి వుంటుంది. అందుకనే ఒక నిర్ణయాన్ని తీసుకొన్న తరువాత పార్టీని ప్రజాసామాన్యాన్ని కలిపే సోవియట్లనూ, ట్రేడ్ యూనియన్లనూ, యువక కమ్యూనిస్టు సంఘాలనూ కదిలించడానికి పార్టీ సంస్థలు తమ కృషిని ప్రారంభిస్తాయి. పార్టీ ప్రతిపాదించిన సత్వర బాధ్యతలను శ్రామిక ప్రజలకు క్షుణ్ణంగా వివరించి తెలియజేయడానికి రాజకీయ

విద్యా, అన్ని రకాలైన ప్రచారక సాధనాలూ, వినియోగించబడతాయి. ఈ విధంగా పార్టీ నిర్ణయం ప్రజల హస్తగతం అవుతుంది. అది వారి మనస్సులలో బాగా చొచ్చుకొనిపోయి అదొక మహత్తర శక్తిగా పరిణమిస్తుంది. పార్టీ నిర్ణయంలో చెప్పబడిన బాధ్యతలు కార్యరూపంలోకి మారడం ప్రారంభమవుతుంది. ప్రజలతోగల సన్నిహిత సంబంధాలు ఎంత ఎక్కువగా, ఎంతబలంగావుంటే అంత యెక్కువగా విజయం గ్యారంటీ అవుతుంది.

దానియొక్క సత్యం పునర్నిర్మాణానికీ, జాతీయ ఆర్థికవిధానాన్ని ఇంకా అభివృద్ధి చేయడానికీ యుద్ధానంతర ప్రణాళికను జయప్రదంచేయడానికి సో. యూ. క. పార్టీ జరుపుతున్న దైనందిన పోరాటంయొక్క ఫలితాలలో కొల్లలుకొల్లలుగా కనపడుతుంది. స్టాలిన్ పంచవర్ష ప్రణాళిక కోటానుకోట్ల సోవియట్ ప్రజల ఆశయంగా పరిణమించింది.

స్టాలిన్ పంచవర్ష ప్రణాళికలు జయప్రదంగా నెరవేరడం మూలంగానే సోవియట్ యూనియన్ ఒక బలవత్తరమైన పారిశ్రామిక రాజ్యమైనదనే విషయం ప్రతివారికి తెలిసిన విషయమే. ఇది మహత్తరమైన చారిత్రాత్మక విజయం. సోషలిస్టు పోటీలో అత్యధికంగా తమశక్తిని వినియోగించిన కోటానుకోట్ల శ్రామిక ప్రజల కార్యాచరణ, ఆత్మత్యాగం, చొరవఫలితంగా యిది సాధ్యమైంది. ముందున్న దారినిచూపెట్టి, తమ ఆశయమార్గంలో వున్న కష్టాలను అధిగమించడానికి సహాయపడిన దృఢమైన పార్టీ నాయకత్వం, ప్రభుత్వంవలన యీ విజయం సిద్ధించింది. వివిధ సోషలిస్టు పారిశ్రామికసంస్థలు జయప్రదంగా తమ పథకాలను పూర్తిచేయగలగడానికికూడా యిదే కారణం. ఉత్పత్తిప్లానులంటే పూర్తిగాలెక్కలనూ, బాధ్యతలను వల్లించడమే ఎంతమాత్రం కావు.

స్టాలిన్ యిలా చెప్పాడు!

"నిజానికి ఉత్పత్తిప్లాను కోటానుకోట్ల ప్రజల సజీవకార్యాచరణ యొక్క మూర్తీభవంతం (ఎంబాడిమెంటు). నూతన జీవితాన్ని సృష్టిస్తున్న కోటానుకోట్ల, శ్రామికప్రజలే మన ఉత్పత్తిప్లానును ఆచరణ సాధ్యం చేస్తున్నారు. సజీవప్రజలమైన మీరూ నేనూ, కృషిచేయడానికి గల మన మనశ్శక్తీ; నూతన విధానంలో పని చేయడానికి మన సంసిద్ధతా, ప్లానును

కొనసాగించడానికి మన కృతనిశ్చయం—యివే మన ప్లాను వాస్తవం అవడానికి కారణం."

"ప్రోబ్లమ్స్ ఆఫ్ లెనినిజం"
పేజీ-387

యుద్ధానంతర స్టాలిన్ పంచవర్ష ప్రణాళికలోని మొదటిమూడు సంవత్సరాలు సాధించిన మహత్తరవిజయ ఫలితాలు కమ్యూనిస్టు పార్టీచే నడుపబడే ప్రజల సోషలిస్టు పార్టీలో ఎంతటి మహోన్నత శక్తి యిమిడివుందో నూతనంగా మరింత ఎక్కువగా ధృవపరుస్తోంది. సోషలిస్టు పార్టీలో ప్రతిచోటా కమ్యూనిస్టులే ప్రప్రథములుగా వుంటున్నారు. తమ తమ ప్రదేశాలలో ప్రాథమిక పార్టీ సంస్థలలో సంఘటితులైన కమ్యూనిస్టు పార్టీ సభ్యులు ఉత్పత్తి శిఖరాలను సాధించడానికి కార్మిక జనసామాన్యాన్ని ఉత్సాహపరుస్తారు. కష్టాలను అధిగమించడానికి వారినందరినీ సమీకరించుతారు; వారిబలంలో వారికి ధైర్యవిశ్వాసాలను కలిగించుతారు; సోవియట్ దేశభక్తి దృక్పథంతో వారికి శిక్షణనిస్తారు.

సో. యూ. క. పార్టీ నిబంధనావళిలో ఉదహరించినట్లుగా ప్రాథమిక పార్టీ సంస్థలు పార్టీ సినాదాలను నిర్ణయాలను అమలు జరిపించడానికి జనసామాన్యంలో ఆందోళనా, నిర్మాణ కార్యకలాపాలను కొనసాగించుతారు. స్థానిక పత్రికలకు సలహాలనిస్తారు. ఉత్పత్తి పథకాలనుకొనసాగించడానికీ, కార్మిక క్రమశిక్షణను పాటించేటట్లు చేయడానికీ, సోషలిస్టు పోటీని అభివృద్ధి చేయుడానికి, ఫ్యాక్టరీలలో ప్రభుత్వ వ్యవసాయ క్షేత్రాలలో, సమిష్టి వ్యవసాయ క్షేత్రాలలో పనిచేసే జనసామాన్యాన్ని సమీకరిస్తారు. ఇంతేగాక వారు (పార్టీ సభ్యులు) పనిలో అలసత్వాన్నీ, అసమర్థనీయంగా వుండే మేనేజిమెంటునూ, ఖండించుతూ ఫ్యాక్టరీ కార్మికుల ఆఫీసుఉద్యోగుల, సమిష్టి వ్యవసాయ క్షేత్రాలలోని కర్షకుల జీవన పరిస్థితులనూ, సాంస్కృతిక స్థాయినీ అభివృద్ధి పరిచడానికి తీవ్రంగా కృషిచేస్తారు.

కమ్యూనిస్టుపార్టీలోని ప్రతి సభ్యుడూ ప్రజానీకంతో సన్నిహిత సంబంధాన్ని ఎల్లప్పుడూ వుంచుకోవాలనీ, శ్రామిక ప్రజల ప్రయోజనాల రక్షణకు సిద్ధంగా వుండాలనీ, పార్టీయేతరవర్గాలకు పార్టీపాలసీ, నిర్ణయాలను వివరించి నచ్చజెప్పాలనీ పార్టీ నిబంధనా

వళిలోని ఒక నిబంధనగా ఉదహరించబడివుంది. తాను స్వయంగా భక్తి విశ్వాసాలతో ఆదర్శనంతముగా పనిచేస్తున్నప్పుడే పార్టీ సభ్యుడు పైన ఉదహరించబడిన తన కర్తవ్యాన్ని జయప్రదంగా నెరవేర్చగలుగుతాడు. నిస్సందేహమైన నిజాయితీనీ, తన పనియెడలా తన సాంఘిక, రాజ్యాంగధర్మాల యెడలా పార్టీ దృక్పథాన్ని ప్రదర్శించడం మూలంగానే – అత్యుత్సాహంగా బోల్షివిక్ దీక్షతో కృషిచేయడంద్వారానే కమ్యూనిస్టుపార్టీ సభ్యుడు పార్టీయేతర ప్రజలకు బోధించడానికీ, కార్మిక జన సామాన్యాన్ని సమీకరించి వారికి నాయకత్వం వహించి నడపడానికీ నైతికహక్కును సంపాదించ గలుగుతాడు. పార్టీచుట్టూ ప్రజలను సమీకరించడానికి కమ్యూనిస్టుయొక్క వ్యక్తిగత ఆదర్శ జీవితమే ఒక మహత్తరశక్తిగా సహాయపడుతుంది.

తన పార్టీసభ్యులు పార్టీయేతర ప్రజానీకాన్ని తమవెంట నడపగలిగే శక్తిని కలిగివుండాలనీ, శ్రామిక ప్రజల ప్రయోజనాలనూ అవుసరాలను తాము హృదయపూర్వకంగా తీసుకొని పనిచేయాలనీ పార్టీ కోరుతుంది. సాంస్కృతిక, మరి యితర విషయాలలో జరిగే లోటుపాట్లను వెనువెంటనే సవరించేందుకు ప్రతి కమ్యూనిస్టు పార్టీ సభ్యుడూ కార్మికుల, సమిష్టి వ్యవసాయ క్షేత్రాల రైతుల, మేధావివర్గానికి చెందిన సభ్యుల అభిప్రాయాలనూ, అభిరుచులను తెలుసుకోవడం, సభలలోనూ, ఉపన్యాసాలు చేసే సమయంలోనూ ప్రజలు అడిగే ప్రశ్నలను దృష్టిలో వుంచుకోవడం అతని కర్తవ్యం. సభలలో ప్రజలు వేసే ప్రశ్నలకు వెంటనే జవాబు చెప్పడము, లోట్లు జరిగినట్లు తెలియజేస్తే, వాటిని వెంటనే సరిదిద్దడానికి సత్వరచర్యలను తీసుకోవడం కమ్యూనిస్టుల కర్తవ్యం.

కమ్యూనిస్టులకూ పార్టీయేతర ప్రజలకూమధ్యనుండే సంబంధాలు పరస్పర గౌరవ విశ్వాసాల పై ఆధారపడి వుంటాయి. అందువలన కమ్యూనిస్టులు తమ పార్టీయేతర కామ్రేడ్సు అనుభవాన్ని దృష్టిలో వుంచుకొని, వారు చెప్పేదాన్ని శ్రద్ధగావిని, పార్టీ బాధ్యతలను నెరవేర్చే సందర్భంలో వారిలోని ఉత్తముల సహాయాన్ని తీసుకొనేందుకు ప్రయత్నించాలి. పార్టీ

సభ్యులు పార్టీగుహల్లోనే కట్టుపడి వుండరాదని పార్టీయేతర ప్రజలతో వేరుపడి వుండరాదనీ, పార్టీసభ్యుల మనేదురభిమానంతో వుండరాదనీ వారు పార్టీయేతర ప్రజలకు బోధించడమేగాక వారినుండి నేర్చుకోవాలనీ స్టాలిన్ చెప్పాడు. బోల్షివిక్ యొక్క ప్రతిష్టహెచ్చించేదివినయమే కాస గర్వం ఎంతమాత్రంకాదనే విషయాన్ని పార్టీ సభ్యులు ఎల్లప్పుడు జ్ఞాపకం వుంచుకోవాలని స్టాలిన్ బోధించాడు.

బోల్షివిక్ వినయనమ్రతలు ఎలావుండాలో కమ్యూనిస్టుపార్టీ నాయకులే స్వయంగాచూపెట్టారు. సిద్ధాంతవేత్త, నిర్మాణంలో గొప్ప మేధావీ అయిన స్టాలిన్ మహాశయుడు ఒక బోల్షివిక్‌కు వుండాల్సిన చక్కటి సుగుణాన్ని ఎలా ప్రదర్శించాడో చెప్పడానికి యీ క్రింది ఉదాహరణ చక్కటినిదర్శనం. 1935 నవంబరు 17 వ తేదీన ప్రథమ అఖల యూనియన్ స్టఖనోవైట్ల సమావేశంలో ప్రసంగిస్తూ స్టాలిన్ యిలా అన్నాడు;

"కార్మిక కర్షకులకు ఎలా బోధించాలో తెలియడమేగాక వారి వద్దనుండి తాము నేర్చుకోవడంకూడా తెలిసిన నాయకులు మాత్రమే నిజమైన బోల్షివిక్ నాయకులని లెనిన్ మనకు బోధించాడు. లెనిన్ చెప్పిన యీ మాటలంటే కొంతమంది బోల్షివిక్‌లకు యిష్టంలేదు. కాని ఈ విషయంలోకూడా లెనిన్ చెప్పినది నూటికి నూరుపాళ్లుసత్యమని చరిత్రచూపెట్టింది. నిజానికి కోటానుకోట్ల శ్రామిక ప్రజలూ, కార్మికులూ, కర్షకులూ ఇతర శ్రమజీవులూ జీవించుతూ, పోరాడుతున్నారు ...... ఈ ప్రజలు వుత్తనే జీవించడం లేదనే విషయాన్ని ఎవరు సందేహిస్తారు? జీవించడం, పోరాడటం మూలంగా యీ ప్రజలు ఆచరణలో ఎంతో అనుభవాన్ని గడించలేదా? ఈ రకమైన అనుభవాన్ని తిరస్కరించే నాయకులను నిజమైన నాయకులుగా పరిగణించరాదనే విషయంలో సందేహమేమన్నా ఉందా? కాబట్టి పార్టీకీ, ప్రభుత్వానికీ నాయకులయిన మేము కార్మికులకు బోధచేయడమేగాక వారివద్దనుండి నేర్చుకోవాలికూడా. ప్రస్తుత సమావేశంలోని సభ్యులైన మీరు యిక్కడ ఈ సమావేశంలో మన ప్రభుత్వనాయకుల నుండి కొంత నేర్చుకొన్నారనే విషయాన్ని నేను కాదనను. కాని అదే సమయంలో యీ సమావేశంలోని సభ్యులైన స్టఖనోవైట్లయిన మీవద్ద నుండి ప్రభుత్వనాయకులమైన మేము ఎంతగానో నేర్చుకొన్నామనే విషయాన్నికూడా కాదనడానికి వీల్లేదు. కామ్రేడ్స్, మీరు మాకు నేర్పిన పాఠానికి వందనాలు, అనేక వందనాలు!"

—ప్రోబ్లమ్స్ ఆఫ్ లెనినిజం,
పేజీ 559

ప్రజలతో దానికిగల బలమైన సంబంధ బాంధవ్యమే కమ్యూనిస్టు పార్టీ యొక్క అజేయశక్తికి జీవన ప్రసాదపునాదని లెనిన్ స్టాలిన్ల వీరోచితపార్టీ నడచిన యావత్తు చారిత్రాత్మక మార్గం మనకు బోధించుతోంది. స్టాలిన్ ఉపమానంగా చెప్పినట్లు బోల్షివిక్ లు గ్రీక్ పురాణగాధలోని భూదేవి కుమారుడైన ఆంటియస్ లాంటి వారు అతడు అజేయుడు. తన శత్రువుతో పోరాటంలో తనకి ఎక్కువగా కష్టం కలిగించినప్పుడల్లా తన తల్లియైన భూమిని తాకేవాడు. వెంటనే అతని బలం రెట్టింపు అయ్యేది. ఇందులోనే అతని బలం యిమిడివుంది. అతని అజేయశక్తికి మూలకారణం ఏమిటో ఒకశత్రువు వూహించేవరకూ అతన్ని ఎవ్వరూ జయించలేక పోయారు. ఆశత్రువు హెర్క్యులస్. ఇతడుఅంటియస్తో జరిగిన పోరాటంలో ఆంటియస్ను భూమినుండి పైకి ఎత్తి, భూమిని తాకకుండా గాలిలోనే వుంచి ఓడించి చంపివేశాడు.

"పార్టీ పనిలోని లోటుపాట్లు" అనే తన వ్యాసంలో స్టాలిన్ యిలా చెప్పాడు:

బోల్షివిక్ లు ఆంటియస్ లాగానే వారు తమను యీ ప్రపంచంలో పుట్టించి, స్తన్యమిచ్చి, పోషించిన తమ తల్లియగు ప్రజాసామాన్యాన్ని అంటిపెట్టుకొని వుండుటవలననే వారు బలంగా వున్నారు. తమ తల్లిని — ప్రజలను వారు అంటి పెట్టుకొనివున్నన్నాళ్లూ వారు అభేద్యులుగా వుండటానికి పూర్తి అవకాశం ఉంది.

"బోల్షివిక్ నాయకత్వం యొక్క అభేద్యతలో నున్న కీలకమిదే."

# VI

# కేంద్రీకృత ప్రజాస్వామికం : కమ్యూనిస్టుపార్టీ అంగనిర్మాణంయొక్క ప్రధానసూత్రం

కార్మికవర్గానికీ తతిమ్మా శ్రామిక ప్రజానీకానికంతటికీ నాయకత్వం వహించి నడిపే తన బాధ్యతను సక్రమంగా నిర్వహించడానికి కమ్యూనిస్టుపార్టీ "ఒకే రకమైన నిబంధనావళినీ, అందరికీ ఒకేవిధంగా వర్తించేక్రమశిక్షణా విధానాన్నీ పార్టీ మహాసభ

(కాంగ్రెసు) అనే ఒకే ప్రధాన సంస్థను కలిగివుండి, మహాసభల మధ్య పార్టీ కేంద్రకమిటీ ప్రధాన సంస్థగా కలిగివుండి; మైనారిటీ మెజారిటీ నిర్ణయాలను శిరసావహించటం, వివిధ సంస్థలూ కేంద్రానికి లోబడివుండటం, క్రింది సంస్థలు పై సంస్థలకు లోబడివుండటం మొదలుగాగల అంశాలుగల కేంద్రీకృతమనేసూత్రాన్ని ఆధారంచేసుకొని నిర్మించబడాలి"

—సో. యూ. క. పార్టీచరిత్ర పేజీ 49

స్టాలిన్ రచించిన "శ్రామిక వర్గమూ - శ్రామికవర్గపార్టీ" అనే గ్రంథంలో యిలా ఉదహరించబడివుంది. "పోరాట శ్రామిక వర్గానికి నాయకత్వం వహించి నడిపే బాధ్యతను తనపై పెట్టుకొన్న పార్టీ ఏదోరకంగా సమకూడిన వ్యక్తుల సముదాయానికిగాక సుసంఘటితమైన ఒక కేంద్రీకృతసంస్థకు ప్రాతినిధ్యం వహించాలి"

కేంద్రీకృతం అంటే పార్టీ యావత్తు కార్యకలాపాలూ ఒకే ఒక కేంద్రాన్నుండి – అఖిల యూనియన్ పార్టీ మహాసభ (కాంగ్రెసు)చే ఎన్నుకోబడిన కేంద్రకమిటీచే నడపబడాలి. మహాసభల మధ్యకాలంలో కేంద్ర కమిటీయే యావత్తు పార్టీ కార్యకలాపాలకు సారథ్యం వహించుతుంది. పార్టీ (ప్రాథమిక, జిల్లా, పట్టణ ప్రాంతీయ, రాష్ట్రీయ)సంస్థలను కలిగివుంటుంది. పై సంస్థల నిర్ణయాలు క్రిందిసంస్థల, పార్టీ సభ్యులందరికీ ఎలాంటి మినహాయింపు లేకుండా వర్తించుతాయి. ఈవిధంగా యావత్తుపార్టీ, పార్టీ సంస్థల కార్యకలాపాలలోనూ ఐక్యత నెలకొల్పబడుతుంది.

కేంద్రీకృత నాయకత్వాన్ని చెలాయించడానికి పార్టీ కేంద్రం స్థానికసంస్థల కార్యకలాపాల పరిస్థితిని పూర్తిగానూ స్పష్టంగానూ తెలుసుకొనివుండాలి పార్టీ కేంద్రం నిజంగా నాయకత్వం వహించడానికి – లెనిన్ ఒకప్పుడు రాసినట్లుగా "పార్టీ కేంద్రం నిజంగా వాయిద్య సమ్మేళనను నిర్వహించడానికిగాను ఎవరుపాడేదీ, ఏవాయిద్యంలో, ఎక్కడ, ఎవరు నేర్చుకొన్నారు? ఇంకెవరు యిప్పుడు నేర్చుకుంటున్నారు? ఏ వాయిద్యంతో వాయించుతారు? ఎక్కడ, ఎవరు, ఎందుకు, సంగీతాన్ని ఎవరు పాడుచేస్తారు, (సంగీతం ఎప్పుడు చెవులకు

వినసొంపుగావుండకుండాపోతుంది) ఎవరిని ఏవిధంగా ఎక్కడ అపస్వరాన్ని సరిదిద్దడానికి మార్పు చేయాలి మొదలుగాగల సమాచారమంతా దానికి తెలిసి వుండాలి."

బోల్షివిక్ పార్టీ అమలు జరిపే కేంద్రీకృతవిధానంలో స్థానిక సంస్థలు విస్తారమైన చొరవను కలిగివుండాలి. పార్టీ జీవిత, కార్యక్రమాలలో పార్టీసభ్యులంతా చురుకుగా పాల్గొనాలి. బోల్షివిక్ కేంద్రీకృతం ప్రజాస్వామిక కేంద్రీకృతం. అంటే పార్టీ ప్రధాన కమిటీలన్నీ ఎన్నుకోబడతాయి. సభ్యులకు తాముచేసిన కృషిని గురించి నివేదికను సమర్పించాలి. సభ్యులు వారిని మార్చి కొత్తవారిని నియమించవచ్చు. రష్యాలో విప్లవానికి ముందు అజ్ఞాతవాసంలో రహస్యంగా కార్యక్రమాన్ని కొనసాగించవలసిన ప్రత్యేక పరిస్థితులలో మాత్రమే పార్టీ సంస్థలు క్రింది నుండి ఎన్నుకొనబడే సూత్రాన్ని అనుసరించలేకపోయినాయి. రహస్యాన్ని కాపాడటంకోసం కమిటీ సభ్యులను కో-ఆప్టు చేసుకోవలసివచ్చేది. అది పార్టీ జీవితంలో తాత్కాలిక వ్యవహారమేననీ జారు ప్రభుత్వాన్ని నాశనం చేయగానే పరిస్థితులు మారుతాయనీ, అప్పుడు పార్టీ బహిరంగంగానూ, లీగల్‌గాను తన కార్యక్రమాన్ని నిర్వహించుతుందని లెనిన్ తన అభిప్రాయాన్ని తెలిపాడు. అప్పుడు పార్టీ సంస్థలు ప్రజాతంత్ర ఎన్నికల సూత్రాన్నీ కేంద్రీకృత ప్రజాస్వామిక సూత్రాన్నీ ఆధారం చేసుకొని నిర్మించబడతాయని లెనిన్ చెప్పాడు.

కేంద్రీకృత ప్రజాస్వామిక సూత్రం సోవియట్ యూనియన్ కమ్యూనిస్టుపార్టీ నిబంధనావళిలో వివరంగా, విపులంగా నిర్వచించబడింది. కేంద్రీకృత ప్రజాస్వామిక పార్టీ అంగనిర్మాణానికి ప్రధాన సూత్రంగా అందులో పేర్కొనబడింది. అందులో యీ క్రింది నిబంధనలు వున్నాయి.

(అ) నాయకత్వం వహించే పార్టీ కమిటీలన్నీ క్రిందినుండి పైవరకూ ఎన్నుకోబడతాయి.

(ఆ) పార్టీ కమిటీలు తమ పార్టీ సంస్థలకు తాము చేసిన పనిని గురించి నివేదించాలి.

(ఇ) ఖచ్చితమైన పార్టీ

క్రమశిక్షణ, మైనారిటీ మెజారిటీని శిరసావహించాలి.

(ఈ) పై పార్టీ కమిటీల నిర్ణయాలను ఎలాంటి షరతులు లేకుండా క్రింది సంస్థలు అమలు జరిపితీరాలి

కేంద్రీకృత ప్రజాస్వామికము అంటే పార్టీ ఆంతరంగిక జీవితమంతా ప్రజాతంత్ర సూత్రాలపై ఆధారపడివుంటుంది. పార్టీ జీవితంలోనూ, కృషిలోనూ సభ్యులంతా చురుకుగా పాల్గొనడంపై ఆధారపడివుంటుంది. లెనిన్ చెప్పిన నిర్వచనం ప్రకారం బోల్షివిక్ పార్టీలో అనుసరించే ప్రజాతంత్రానికి అర్థమేమంటే: "పార్టీ వ్యవహారాలన్నీ ప్రత్యక్షంగా లేక ప్రతినిధులద్వారా పార్టీలోని సభ్యులందరిచేతా ఎలాంటి మినహాయింపు లేని సమాన ప్రాతిపదికపై నడుపబడతాయి. పార్టీలోని ఉద్యోగ బృందమూ, అన్ని సారధ్య కమిటీలూ, పార్టీకి చెందిన అన్ని సంస్థలూ ఎన్నుకోబడతాయి. ఇవన్నీ తమపార్టీ సంస్థలకు జవాబుదారీ వహిస్తాయి. సభ్యులు వీరిని మార్చి వారిస్థానంలో మరొకరిని నియమించే హక్కును కలిగి ఉంటారు."

కేంద్రీకృత ప్రజాస్వామిక సూత్రమే మొట్ట మొదటనుండీ పార్టీ అభివృద్ధికి ఆధారమైంది. బోల్షివిక్ పార్టీ 11 వ మహాసభ (కాంగ్రెసు) ఆమోదించిన తీర్మానం స్పష్టం చేసినట్లుగా కేంద్రీకృత ప్రజాస్వామిక సూత్రాలను ఖచ్చితంగా అమలు జరపకుండా ప్రపంచంలోని ఆరోవంతు భూభాగాన్ని పరిపాలించడం అసాధ్యమైనదని. పార్టీ సంస్థల అంగనిర్మాణంలోనూ, వాటినాయకత్వ నిర్మాణంలోనూ, కేంద్రీకృత ప్రజాస్వామిక సూత్రాన్ని క్రమపద్ధతిని అమలు జరపాలనీ, పార్టీ కమిటీలు తమ సంస్థలకు రెగ్యులర్‌గా తమ పనిని గురించి నివేదికలు సమర్పించాలనీ, పార్టీ కమిటీల ఎన్నికలలో రహస్యబ్యాలట్ ఉపయోగించాలనీ సో. యూ. క. పార్టీ నిబంధనావళి నిర్దేశించింది. ఇదంతా పార్టీ శక్తిసామర్థ్యాలు కలిగివుండటానికీ, ఏకీకృత సంస్థగా (మోనోలిథిక్) వుండటానికి సుసంఘటితంగా వుండటానికి వినియోగపడుతుంది. ఇటీవల జరిగిన దేశభక్తియుత యుద్ధకాలంలోని పార్టీ కృషియొక్క అనుభవం, పార్టీ అంగనిర్మాణానికి సంబంధించిన

యీ సూత్రంయొక్క పటిష్టతను మరొకసారి ధృవపరచింది. యావత్తు బోల్షివిజం చరిత్రా యీసూత్రంయొక్క పటుత్వాన్ని రుజువు చేసింది.

కేంద్రీకృత ప్రజాస్వామిక సూత్రాన్ని ఖచ్చితంగా అమలు పరిస్తే పార్టీ సంస్థలన్నింటి కార్య కలాపాలు, పార్టీ సభ్యుల కార్యాచరణా చాల ఉన్నతస్థాయిని తప్పని సరిగా అందుకుంటాయి. ఇంకా దీనివలన ధైర్యమైన బోల్షివిక్ విమర్శన, ఆత్మవిమర్శన అభివృద్ధి చెందడానికి సరియైన పరిస్థితులు సృష్టించబడతాయి. సో. యూ. క. పార్టీ నిబంధనావళిలో ఉదహరించినట్లుగా "పార్టీ ఆంతరంగిక ప్రజాస్వామికంవల్లనే బోల్షివిక్ ఆత్మవిమర్శనను అభివృద్ధి పరచుకోడానికీ, పార్టీ క్రమశిక్షణను బలపరచుకోడానికీ సాధ్య పడుతుంది. పార్టీ తన కార్మికవర్గ నాయకత్వ పాత్రను ఎల్లప్పుడూ జయప్రదంగానే నిర్వహించినదని బోల్షివిక్ పార్టీ చరిత్ర చూపెడుతోంది. దానికి కారణమేమంటే పార్టీ ఎన్నడూ దురభిమానంలో కొట్టుకొనిపోలేదు. తన పనిలోని లోట్లను ఎల్లప్పుడూ ధైర్యంతో విమర్శించుకొన్నది. చిత్తశుద్ధితో బహిరంగంగా తన పొరపాట్లను అంగీకరించి, వెనువెంటనే సరిదిద్దుకోడానికి అది ఎన్నడూ భయపడలేదు.

లెనిన్ యిలా చెప్పాడు :

"ఇదివరకు నశించిన విప్లవపార్టీలన్నీ ఆత్మవంచనలో పెరగడంవలనా, తన బలం ఎక్కడనున్నదో చూడలేక పోవడంవలనా, తమ బలహీనతలను తెలియజెప్పడానికి భయపడటం మూలంగానూ అలా నశించిపోయాయి. కాని మనం మన బలహీనతలనుగురించి మాట్లాడటానికి భయపడం గనుక, మనం ఆబలహీనతలను అతిక్రమించడం నేర్చుకొంటాంగనుక ఆవిధంగా మనం నశించం."

లెనిన్, స్టాలిన్‌లపార్టీ అభేద్యమైనది. ఎందువల్లనంటే తన తప్పు నుండి నేర్చుకొని వెంటనే ఆతప్పులను సరిదిద్దుకోవాలని అది తన సభ్యులకు బోధించుతుంది. ఇంతేకాక పార్టీ ఆంతరంగిక ప్రజాతంత్రాన్నీ, ఆత్మవిమర్శనను అభివృద్ధి పరుస్తుంది. దీనివలన సామాన్య పార్టీసభ్యులు పార్టీ పాలసీలను అమలులోపెట్టే విషయంలో సృజనాత్మకపాత్రను నిర్వహించడానికీ, మామూలుగాజరిగే పార్టీసమావేశాలలోనూ, విస్తృత కమిటీల సమావేశాలలోనూ చురు

కైన కార్మికుల సమావేశాల్లోనూ, సభలలోనూ సామాన్య సభ్యులు తమనాయకులను పరీక్షచేయడానికి పిలవ్వుతుంది.

కేంద్రీకృత ప్రజాస్వామిక సూత్రాన్నుండి బిడదారిపడటం, ఆత్మవిమర్శను అణచివేయడము సభ్యుల హక్కులను అతిక్రమించడము, పార్టీని గురించి లెనిన్ స్టాలిన్‌లఉపదేశాలకు వక్రభాష్యాలను కల్పించడం — ఇవన్నీ అసలు కమ్యూనిస్టుపార్టీ అస్తిత్వానికే దారుణమైన ప్రమాదాన్ని తెచ్చిపెడతాయి. యుగోస్లోవియా కమ్యూనిస్టుపార్టీ వ్యవహారాల పరిస్థితిలో యిది అత్యంత స్పష్టంగా రుజువైంది. అక్కడ టిటోముఠా పార్టీలో భీభత్సకరమైన (టెర్రరిస్టు) నిరంకుశ అధికారాన్ని స్థాపించుకొన్నది. ఈ అధికార ముఠాను ఏమాత్రం కొద్దిగా విమర్శించినప్పటికీ దాన్ని సహనాన్ని పూర్తిగాకోల్పోయినఆనాయకులు క్రూరంగాఅణచివేస్తారు. సోషలిజం విజయంకోసం చిత్తశుద్ధితోనూ, ధైర్యసాహసాలతోనూ పోరాడిన వారిని యుగోస్లోవియా నాయకులు అనుసరించుతున్న సోవియట్ వ్యతిరేకపంధానూ విమర్శించినందుకే సోవియట్ యూనియన్‌తో స్నేహసంబంధాలు వుండాలన్నందుకే జైళ్ళలో పెట్టారు. కొంతమందిని ఖూనీ కూడా చేశారు.

ఒకప్పుడు ట్రాట్స్కీ యింకా యితర సామ్రాజ్యవాద ఏజెంట్లు సో. యూ. క. పార్టీలోకి ప్రవేశించగలిగినప్పుడు అలాంటి నాయకత్వ పద్ధతులనే ప్రవేశపెట్టడానికి ప్రయత్నించారు. కాని సో. యూ. క. పార్టీ ట్రాట్స్కీ లాంటి దరిద్రులను పార్టీనుండి గెంటివేసింది. యుగోస్లోవియాలోని ట్రాట్స్కీయిట్ విద్రోహులకు కూడా అలాంటిగతే పడుతుంది.

# VII

## ఖచ్చితమైన క్రమశిక్షణ: కమ్యూనిస్టుపార్టీ విజయానికి ఒక ప్రధాన కారణం

తన అనుయాయులలో ఎలాంటి మినహాయింపులు లేకుండా క్రమశిక్షణను నెలకొల్పి, దానిని ఎల్లప్పుడూ బలపరచుకోవడం కమ్యూనిస్టుపార్టీ నిర్మాణ సూత్రాలలో ఒక ప్రధాన

మైన సూత్రం అనేకసార్లు లెనిన్ యిలా చెప్పాడు "బూర్జువావర్గం పై విజయాన్ని సాధించడానికి శ్రామికవర్గంలో సంపూర్ణమైన కేంద్రీకృతమూ, ఖచ్చితమైన క్రమశిక్షణా ప్రధానమైన అవసరాలు."

—(సెలెక్టడ్ వర్క్సు, రెండు సంపుటాల ప్రతి సంపుటి 2, పేజీ 574)

మార్క్సిస్టుపార్టీ సభ్యులలోని శ్రామికవర్గ క్రమశిక్షణాదృక్పథాన్ని అసహ్యాహించుకొనే బూర్జువా మేధావుల రాచరిక అరాచకత్వాన్ని లెనిన్ తీవ్రంగా విమర్శించాడు.

1904 లో ఆయన యిలా రాశాడు:

"నిజమైన పార్టీని మనం నిర్మించుతున్నప్పుడు చైతన్యవంతుడగు కార్మికుడు శ్రామికవర్గ సైన్యంలోని సైనికుని మనస్తత్వానికీ తన అరాచక వాచాలత్వాన్ని ప్రదర్శించుకొనే బూర్జువా మేధావి మనస్తత్వానికీ మధ్య నున్న విభేదాన్ని గ్రహించ గలగడం నేర్చుకోవాలి. పార్టీ సభ్యుని యొక్క విధులను నెరవేర్చవలసింది సామాన్యసభ్యులే గాక "అగ్రస్థానాలలో వున్న" వారు కూడాననే విషయాన్ని నొక్కిచెప్పడం అతను నేర్చుకోవాలి."

—సెలెక్టడ్ వర్క్సు, సంపుటి 1 పేజీ 338

బొల్షివిక్ పార్టీ క్రమశిక్షణ ప్రత్యేక స్వభావమేమంటే అది మెకానికల్ (ఏదో యంత్రంవలె) గాక చైతన్యవంతంగా అనుసరించబడుతుంది. చైతన్యపూరితమైన క్రమశిక్షణ అనగానే పార్టీ సభ్యులంతా పార్టీ జీవితానికి సంబంధించిన అన్ని సమస్యల చర్చలలోనూ చురుకుగా పాల్గొని తమంతటతామేగా నిర్ణయాలు చేయడమవుతుంది.

ఉక్కు లాంటి క్రమశిక్షణ అనగానే అంతరంగిక పార్టీ సంస్థలలో అభిప్రాయ భేదాలుండ రాదని కాదు. పైగా పార్టీ పాలసీకి సంబంధించిన సమస్యల చర్చల సందర్భంలో విమర్శలూ, ఒకరి అభిప్రాయాలను మరొకరు ఖండించడం మొదలుగా గలవన్నీ అలాంటి క్రమశిక్షణలో యిమిడి వున్నాయి.

స్టాలిన్ యీ సందర్భంలో యిలా చెప్పాడు:

"పార్టీ క్రమశిక్షణ ఉక్కుశిక్షణగా వుండటమంటే గ్రుడ్డిగా అనుసరించడం కానేకాదు. నిజంగా ఆలోచిస్తే చైతన్యంతోకూడిన క్రమశిక్షణమే నిజమైన ఉక్కుశిక్షణ. గనుక పార్టీలో సభ్యులు వారంతటవారే మనస్ఫూర్తిగా, చైతన్యంతో శిక్షణకు బద్ధులై వుండటం అవసరం. కాని అభిప్రాయ భేదాలన్నింటినీ తర్కించుకొన్న తరువాత, విమర్శన పూర్తి అయిన తరు

వాత, నిర్ణయం తీసుకొన్న తరువాత, పార్టీ సభ్యులందరూ కార్యాచరణలో ఆనిర్ణయానికిబద్ధులైవుండాలి. అలాంటి ఐక్య మనశ్శక్తి పార్టీలో లేనియెడల పార్టీలో ఐక్యతా, ఉక్కు-శిక్షణ వుండటం అసాధ్యం."

("ప్రోబ్లమ్స్ ఆఫ్ లెనినిజం" పేజీ 81)

లెనిన్ యిలా వ్రాసాడు:

"దానికి తగిన సంస్థలు ఒక నిర్ణయం చేసిన తరువాత పార్టీ సభ్యులమైన మనందరం ఒకేమనిషివలే పనిచేస్తాం"

బోల్షివిక్‌ల విజయానికి గల ప్రధాన కారణాలను సమీక్షిం చుతూ 1920 లో లెనిన్ యిలా వ్రాశాడు;

"......మనపార్టీలో ఖచ్చితమైన నిజమైనఉక్కు-శిక్షణవుండి వుండకపోయి నట్లయితే - యావత్తు కార్మికవర్గప్రజా సామాన్యం పార్టీకి తమ సంపూర్ణమైన పరిపూర్ణమైన అండను యిచ్చివుండక పోయినట్లయితే బోల్షివిక్కులు రెండు న్నర సంవత్సరాలుకాదుగదా రెండు న్నర మాసాలు సహితం తమ అధికా రాన్ని నిలబెట్టుకొనగలిగేవారుకాదు."

(సెలెక్టెడ్‌వర్క్సు సంపుటి 2 పేజీ 573)

శ్రామికవర్గ పార్టీలోని క్రమ శిక్షణ ఎలా నెలకొల్పబడి, పరీ క్షలో నిగ్గుతేలి, బలబడిందంటే ఒకటి: శ్రామికవర్గ అగ్రగామి యొక్క చైతన్యం, మనస్థైర్యం, ఆత్మత్యాగంవల్లనూ; రెండు; కార్మిక జనసామాన్యంతో సన్ని హిత సంబంధాల నెలకొల్పు శౌన గల శక్తి సామర్థ్యాల వల్లనూ; మూడు: పార్టీ నిర్వహించిన సరి మైన రాజకీయ నాయకత్వం సరి మైన వ్యూహం, ఎత్తుగడలవలనా. దీనినే యావత్తు బోల్షివిజంచరిత్రా ప్రదర్శించింది.

పైన ఉదహరించిన షరతులలో ఏ ఒకదానిని అతిక్రమించినప్పటికి పార్టీలోని క్రమశిక్షణ సడలి పోవడం తప్పదు. పార్టీసభ్యుల లోని ఐక్యత, దృఢమైన పట్టుదలా పార్టీకి ఎంతటి మహోన్నత మైన బలాన్ని చేకూర్చుతాయో తమకు బాగా తెలుసును గాబట్టే ట్రాట్స్కీ-ముఠా జినోవ్ ముఠా, బుఖారిన్ వాదులూ, జాతీయవా దులూ యింకా యితర పార్టీ శత్రుమూకా, పార్టీలోని క్రమశిక్ష ణను సడలింప జేయడానికీ ముఠా లను ప్రవేశపెట్టడానికీ పార్టీని వివిధ గ్రూపులక్రింద చీలదీయడా నికి — ఆ విధంగా పార్టీని దెబ్బతీసి బలహీన పరచడానికి తమ పనిని ప్రారంభించారు.

అన్నిరకాలకుచెందిన ముఠాల వాదులనూ (ప్రాక్షనలిస్టు) ఓడించి పార్టీలోని లొంగుబాటుదారులనూ ద్రోహులనూ బైటికి గెంటివేసి పార్టీని శుద్ధి పరచిన తరవాత

లెనిన్‌పార్టీ తన సభ్యులను మరింత సన్నిహితంగా సంఘటిత పరచ గలిగింది. పార్టీసభ్యులందరియొక్క ఐక్య మనశ్శక్తినీ, ఐక్యకార్యాచరణను యింకా ఎక్కువగా బల పరచుకొనగలిగింది.

స్టాలిన్ యిలాచెప్పాడు:

"సకాలంలో అవకాశవాదద్రోహులనూ, లొంగుబాటుదారులనూ, మెన్షివిక్కులనూ పార్టీనుండి బయటకు గెంటివేయడం మూలంగానే ప్రధానంగా మనపార్టీ ఆంతరంగిక ఐక్యతనూ, సభ్యులలో అపూర్వమైన ఐక్యతనూ సృష్టించగలిగింది. ఈ విధంగా అవకాశవాదులనూ, సంకుచిత సాంఘికకశేళభక్తులనూ, బూటకపు అహింసావాదులనూ పార్టీలోనుండి వెళ్ళగొట్టడంవల్లనే శ్రామికవర్గ పార్టీలు అభివృద్ధిచెంది బలపడతాయి. అవకాశవాద శక్తులను బయటకు గెంటివేసి శుద్ధిచేయడంవల్లనే పార్టీ సంఘటిత పడుతుంది."

(ప్రోబ్లమ్స్ ఆఫ్ లెనినిజం పేజి 88)

ఈ సూత్రాలే సోవియట్ యూనియన్ కమ్యూనిస్టు పార్టీ నిబంధనావళిలో పొందుపరచబడ్డాయి. అందులో యిలావుంది:

"పార్టీ సభ్యులందరికీ సమానంగా వర్తించే చైతన్య ప్రపూరితమైన క్రమశిక్షణతో సమకూర్చబడిన సంయుక్త తీవ్రమైనసంస్థయే పార్టీ. తన అపూర్వ ఐక్యతవల్లా, ఐక్య మనశ్శక్తి, ఐక్య కార్యాచరణవల్లా పార్టీ బలంగా వుంటుంది. పార్టీ కార్యక్రమాన్ని, నిబంధనలను సభ్యులు అతిక్రమించడం ఎంతమాత్రం పనికిరాదు. సభ్యులు పార్టీ క్రమశిక్షణకు భంగం వాటిల్ల జేయడంగానీ, ముఠాలు కట్టడంగాని, కుట్రలు జరపడంగాని పనికిరాదు. పార్టీ నిబంధనలనూ, పార్టీ క్రమశిక్షణను ఉల్లంఘించినవారిని బయటకు గెంటివేసి పార్టీ శుద్ధిపడుతుంది.

సో. యూ. క. పార్టీ నిబంధనావళిలో ఉదహరించినట్లుగా పార్టీ క్రమశిక్షణను కాపాడటం పార్టీ సభ్యులందరి, పార్టీ సంస్థలన్నింటి ప్రాథమిక ధర్మం. నిబంధనల ప్రకారం పార్టీ శిక్షణను అతిక్రమించడం, పై కమిటీల నిర్ణయాలను పాటించకపోవడం మొదలుగాగల పార్టీ సభ్యులంతా గుర్తించిన తప్పులను చేసినవారు ఖండించబడటం దగ్గరనుండి పార్టీనుండి వెళ్ళగొట్టబడటంవరకు వున్న శిక్షలకు పాత్రులవుతారు.

కమ్యూనిస్టు పార్టీల నన్నింటినీ బోల్షివిక్ తత్వంతో నింపవలసిన ప్రధాన ఆవశ్యకతను గురించి 1925 లో స్టాలిన్ ఒక జర్మన్ కమ్యూనిస్టుపార్టీ సభ్యునితో మాట్లాడుతూ, బలవత్తరమైపార్టీ క్రమశిక్షణ వుండుట ఒక ప్రధాన అవసరమని చెప్పాడు. ఇంకాఆయన యిలా అన్నాడు:

"పార్టీ సభ్యత్వమంతా పార్టీ బాధ్యతల యెడల ఐక్యకార్యాచరణ దృష్టినీ, చైతన్యయుతమైన వైఖరిని కలిగివుండటం, అపూర్వ సిద్ధాంతఐక్యతనూ, ఉద్యమ ఆశయాల యెడ విస్పష్టతనూ అభివృద్ధి పరచుకొని ఉక్కు-శిక్షణలాంటి శ్రామిక వర్గ క్రమశిక్షణను పార్టీ ఆచరణలో పెట్టడం అత్యవసరం."

తన సభ్యుల సిద్ధాంత పరిజ్ఞాన స్థాయినీ, రాజకీయ చైతన్యాన్ని అభివృద్ధిపరచుకోడానికీ, పార్టీకి ప్రజలతో గల సన్నిహిత సంబంధాన్ని క్రమంగా బలపరుచుకోడానికీ, చైతన్యయుతమైన ఉక్కు-శిక్షణను అలవరచుకోడానికీ, కేంద్రీకృత నాయకత్వాన్నీ - దీనితోపాటు పార్టీ అంతరంగిక ప్రజాస్వామికాన్ని ధైర్యమైన బోల్షివిక్ ఆత్మ విమర్శనను అభివృద్ధి పరుచుకోడానికీ పార్టీ శ్రద్ధతీసుకొని, ఎడతెగని కృషి చేయవలసి వుంటుంది. ఇవే లెనిన్ స్టాలిన్ల మహత్తర పార్టీకి బ్రహ్మాండమైన ఐక్యతాశక్తినీ అపూర్వమైన చలనశక్తినీ ప్రసాదించిపెట్టాయి. అందువల్లనే అది బహు కొద్ది సమయంలోనే తన సభ్యులను సంస్కరించుకోనడానికీ, వందల వేలాది తన సభ్యులను ఏ గొప్ప కార్యంపైన అయినా కేంద్రీకరించగలగడానికీ, కమ్యూనిస్టు సమాజ నిర్మాణ ఆశయాన్ని సాధించడానికి లక్షాది లక్షల శ్రామిక ప్రజలను సమీకరించడానికీ, అవసరమైన శక్తినీ సంసిద్ధతనూ కలిగివుండగలిగింది.

[ఈ వ్యాసం ఇండియాలోని సోవియట్ టాస్ వార్తా సంస్థచే ప్రకటించబడింది.]



# కూలి - పని - పెట్టుబడి

రచన:

కార్ల్ మార్క్స్

అనువాదం:

రామారావు

వెల 0–12–0

మార్క్సిజానికి మూలపురుషుడైన కార్ల్‌మార్క్స్ వ్రాసిన గ్రంథమిది. ఈనాడు జరుగుతూఉన్న వర్గపోరాటాలకూ జాతీయ పోరాటాలకూ మూలమైన ఆర్థిక సంబంధాన్ని గురించి ఈ గ్రంథంలో సిద్ధాంతీకరించబడింది. పెట్టుబడి ఏవిధంగా దోపిడికి కారణభూతం అవుతూ ఉందో తెలియజేయబడింది. జీతాలు అంటే ఏమిటో ఇందులో చక్కగా వివరించబడింది. పీఠికలో ఎంగిల్స్ చెప్పినట్లు:

"దినదినమూ పాతబడినవి పాతబడుతూ ఉంటే, అంతకంతకధికంగా విషయాలు కనిపెట్టబడుతూన్నకొలదీ మనుష్యుని ఉత్పత్తిశక్తి కనివిని ఎరుగనంతగా పెరుగుతుంది. చివరకు నేటి పెట్టుబడిదారీ విధానాన్ని అంతరింపజేసే మహాఘర్షణను కలిగిస్తుంది. ఒకవేపున, అమితములైన సంపదలూ, కొనుగోలుదార్లు కొనలేనన్ని వస్తువులూ ఉంటాయి. రెండోవైపున శ్రామికులైపోయిన కూలిపనివారుగా మార్చబడిన అనంత ప్రజాసామాన్యం ఉంటుంది. వీరు కూలిపనివారుగా మారిపోవడం చేతనే ఈ అదనపు వస్తువులను తాము అనుభవించలేకుండా ఉన్నారు. బాగా ధనవంతులైన కొద్దిమంది ఒకభాగంగానూ, ఆస్తిపాస్తులు లేని అత్యధిక సంఖ్యాకులైన కూలి పనివాళ్ళు ఒక భాగంగానూ సమాజం రెండుగా విడిపోయింది. అందుచేతనే సమాజం అధిక సంపదల మూలంగా ఉక్కిరిబిక్కిరి అయిపోతూఉంది. సమాజంలోని అత్యధిక సంఖ్యాకులు కనీసావసరాలుకూడా తీరకుండా ఉన్నారు. ఈపరిస్థితులు రోజురోజుకీ అసహ్యమూ, అనవసరమూ, అయిపోతున్నాయి. వాటిని రద్దు పరిచితీరాలి. రద్దుపరచవచ్చును కూడా. ఈనాడున్న వర్గభేదాలన్నీ అదృశ్యం అయ్యే నూతన సమాజాన్ని నిర్మించడం అవసరం."

ఈ నూతన సమాజ నిర్మాణానికి సిద్ధాంత పునాదులువేసిన మూలగ్రంథాల్లో ఇదొకటి. మార్క్సిస్టు విజ్ఞానాన్ని ఆర్జించగోరేవారు ఈ గ్రంథాన్ని అధ్యయనం చేయడం అవసరం.

*

# గతితార్కిక చారిత్రక భౌతికవాదం

రచయిత: స్టాలిన్

అనువాదం: సి మహేశం

వెల 0—4—0

ఈ పైమూడు పుస్తకములు త్రిలింగ పబ్లిషింగ్ కంపెనీవారు ప్రచురించినవి.

ప్రతులకు:—

లీలాబుక్‌డిపో, విజయవాడ 2

ప్రచురణ -

త్రిలింగ పబ్లిషింగు కంపెనీ

విజయవాడ

దొరకుచోటు:-

లీలా బుక్ డిపో

గవర్నర్‌పేట, విజయవాడ.

# ప్రకటన

జనత పాత కాపీలకొరకు చాలామంది వ్రాస్తున్నారు. అందుచేత మావద్ద ఉన్న కాపీలను చదువరులకు అందజేయుట కొరకై బైండ్లు చేయించి వుంచాము. కావలసినవారు వెంటనే డబ్బు పంపండి.

వివరాలు: 5 నుండి 10 సంచికవరకు
11 ,, 16 ,,
బైండు 1 కి రు 4-0-0 లు
పోస్టేజి 0-8-0

ఏజంట్లకు

మీ ఎవరివద్దనైనా నెం. 19 జనత సంచికలు ఉంటే వెంటనే మాకు పంపగోరుతాము.

మేనేజరు
**జనత**
గవర్నరుపేట - విజయవాడ 2

Regd No. 5296
JANATA,
A Telugu Marxist
Fortnightly



Edited, Printed & Published by
G. Venkateswara Rao Kottapet, Guntur, Printed at Kavitil ... ess, Vijayawada



# మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA134M123 |
| పుస్తకం పేరు | జనత |
| తారీఖు | 31/10/24 |
| ముందు అట్ట | Yes |
| వెనుక అట్ట | Yes |
| మొత్తం పేజీలు | 85 |
| పెద్ద సైజు పేజీలు | |
| ఖాళీ పేజీలు | C1, BC1 |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | Navya |
| పేజీలు విడదీసినది | Bhanu |
| స్కాన్ చేసినది | Mounika |
| పరీక్ష చేసినది | RUKSANA |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | Good |